## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **మోహన్ పబ్లికేషన్స్** వారి వెబ్ సైట్: http://www.mohanpublications.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com.
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్:

**http://www.mohanpublications.com/**

Mohan Publications - E Bo

www.mohanpublications.com/ebooks_category.php

mohan PUBLICATIONS

eBook Share Now

www.మోహన్ పబ్లికేషన్స్.com

Home | About | Book List | E-Books | E-Novels | Order Now

Just Releaded Books | Distribution Books | Premium E-Books | Free E-Books

**Books Catelogue**

- వ్రత కథలు - పూజలు
- స్తోత్రాలు - సుప్రభాతములు సహస్రనామాలు
- శ్రీ సాయి దత్త గ్రంథములు
- జ్యోతిషాలు
- వాస్తులు
- మంత్ర శాస్త్రాలు
- గ్రంథాలు - ఆరాధనలు
- వైద్య గ్రంథాలు

**Free E-Books Category**

- Devotional & Spiritual Books
- Pujas & Vrathas
- Sahasranama Books
- Jyothisham & Vaastu
- Puranas & Vedas
- Ayurveda & Homeopath

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సహస్రాధిక ఉచిత తెలుగు
ఇ - గ్రంథములకు
వీక్షించండి...

WWW. MOHAN PUBLICATIONS.COM

==========================

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, వైద్య,
మంత్రశాస్త్రాది గ్రంథములకు

# మోహన్ పబ్లికేషన్స్,


కోటగుమ్మం,
అజంతాహోటల్ ఎదుట,
రాజమండ్రి - 533 101.
తూర్పుగోదావరిజిల్లా
ఆంధ్రప్రదేశ్
ఇండియా.
ఫోన్ : (0883) 2462565

# చలిజ్వరము

(ఇది వ్యాపించువిధము, దీనిని నివారించుపద్ధతులు, చికిత్స)

ఇది

'జీవశాస్త్రము' 'కలరా' 'అంటువ్యాధులు' మున్నగు గ్రంథముల
రచించినవారును, 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ' మందలి ప్రకృతి
శాస్త్రభాగమునకు సంపాదకులును శస్త్రశాస్త్ర
వైద్యశాస్త్ర విశారదులును నగు

డాక్టరు, ఆచంట లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి, సి. ఎం.

గారిచే రచింపఁబడినది

రెండవ కూర్పు.

చెన్నపట్టణము

ఇండియా ప్రింటింగు వర్క్సు ముద్రాక్షరశాల

1915



[వెల 0-7-0

మొదటికూర్పునకు

# సంపాదకీయ భూమిక.

---

ఇయ్యది మాచేఁ బ్రచురింపఁబడిన 'కలరా' గ్రంథమునకు రెండవదియగు వైద్యగ్రంథము. దీనిని డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు మాకొసంగిరి. 'కలరా' అకస్మాత్తుగఁ బైఁబడునదిగాన నయ్యది యనినఁ బ్రజలు భయకంపితులయి వెన్నంటనఁ జికిత్సల నరయుచుందురు. చలిజ్వరము 'కలరా' కంటెను ఎక్కుడు అపాయకరమయిన దనుట ఈ గ్రంథములోని మొదటి కొన్నిపుటలు చదువువారెల్లఱకుఁ దెల్లముగాఁ గలదు. కాని ఇది మెల్లఁగఁ దెలియరాని విధమున నాటుకొని చెఱుపు చేయుటంజేసి ప్రజలకు విశేషము భయము పుట్టుటలేదు. భయము గల్గినంగాని ప్రతీకార మార్గములకుఁ బూనుట మనకు పట్టుపడినదిగాదు. ఈ యభ్యాసమునకుఁ స్వదేశీయులఁ బురికొల్పుట విద్యావంతుల కర్తవ్యము గదా యని తలంచి మేమీగ్రంథమును వెలువఱచితిమి. గ్రంథకర్తలగు ఆచంట - లక్ష్మీపతిగా రభినందనీయులు. ఆంధ్రలోక మీగ్రంథము నుపయోగించి మమ్ముం గృతార్థుల నొనర్చెడునుగాత!

**28-8-1912.**
మద్రాసు.

సంపాదకుఁడు.

# విషయసూచిక

## మొదటి ప్రకరణము

### జ్వరభేదములు



## రెండవ ప్రకరణము

### చలిజ్వరముయొక్క పూర్వచరిత్ర

## మూడవ ప్రకరణము

## మలేరియా పురుగు



## నాలుగవ ప్రకరణము

## దోమ

## ఐదవ ప్రకరణము

### చలిజ్వర భేదములు



## ఆరవ ప్రకరణము

### చలిజ్వర లక్షణములు



## ఏడవ ప్రకరణము

### చలిజ్వర నిదానము



## ఎనిమిదవ ప్రకరణము

### చికిత్స

10-వ పటము.



11-వ పటము.



1, 2, 3, 4, తెల్లకణములు, యెఱ్ఱనిచుక్కలు - ఎఱ్ఱకణము.

# చలి జ్వరము

ఇది వ్యాపించువిధము ; దీనిని నివారించు పద్ధతులు ; చికిత్స

## మొదటి ప్రకరణము

### జ్వరభేదములు

మన దేశమునందు అన్ని వ్యాధులలో సర్వ జ్వరము సా మాన్యవ్యాధి. సామాన్యమైనవ్యాధి జ్వరము. గడచిన 10 సంవత్సరములలోపల ఏ సంవత్సరము యొక్క జనాభా లెక్కలు తీసిచూచినను ఈ దేశమునందు జ్వరము వలన మృతినొందిన జనులసంఖ్య తక్కిన వ్యాధులన్నిటిచే చచ్చినవారి మొత్తముకంటె అయిదారురెట్లు హెచ్చుగా నున్నది.

క్రొత్తగా మన దేశమున బుట్టిన మహా మారి వ్యాధివలన గడచిన 6 సంవత్సరములలో మన హిందూ దేశమున అంతటను జేరి 15 లక్షల మంది చనిపోయినట్లు కనబడుచున్నది. జ్వరమువలన ఒక్కొక సంవత్సరమునందే 40 లక్షలు మొదలు 50 లక్షలవరకు చచ్చుచున్నారు. మహామారి

వ్యాధిని గురించి మాటలాడినప్పుడు ప్రజలు భయ పడుచున్నారుగాని అంతకంటె 15 రెట్లు హెచ్చుగ మన దేశపు ప్రజలప్రాణములను తీయుచున్న ఈ జ్వరములను గూర్చి అందరును నిర్లక్ష్యముగ నున్నారు. ఈ జ్వరముల వలన, చనిపోవువారల సంఖ్యకంటె, చిరకాలము రోగపీడితులై బలమును కోల్పోయి పనిపాటలు చేయలేక, భూమికి బరువు చేటుగానున్న ప్రజలసంఖ్య ఏటేట ఎంత హెచ్చు చున్నదో చెప్పనలవికాదు.

ఒక్క బొంబాయి పట్టణములో ఒక్కొక సంవ త్సరమునకు * పనిపాటలు చేయువారలలో మాత్ర ము లెక్క వేయగా సంవత్సరము ఒక్కింటికి రెండు లక్షల ఇరువది అయిదువేలమంది జ్వరపడుచు న్నారు. వీరందరు సగటున సంవత్సరమునకు ఒక వారము పని చెడుచున్నారు. పనివానికి సగటున దినము 1-కి రు 0-5-0-లు జీతముచొప్పున లెక్క వేసికొనిచూడగా మొత్తముమీద పనివారలకు మాత్రము ఒక్కొక సంవత్సరమునకు 5, 62, 500. రూపాయలునష్టము వచ్చుచున్నది.

---

* ఈ లెక్కలు 1911 సం॥ రంలో ప్రచురింపబడిన డాక్ట రు బెంట్లేగారి 'మలేరియా జ్వరకారణ విచారణ' యను గ్రంథమునుండి తీసికొనబడినవి.

జ్వరము వలన మంచము మీదనున్న వారము దినములలో కలుగు ఈనష్టమునకు, వీరలు పనిలో ప్రవేశించిన తరువాత చాలదినముల వరకు బల హీనతచేత పని తక్కువగా చేయుటవలన వారి యజమానులకు వచ్చునష్టమును, వీరు జ్వరముతో బాధపడునప్పుడు వీరి ఉపచారము నిమిత్తమై పని చెడి ఇంటి యొద్దనిలిచియున్న వారికి కలుగు నష్ట మును, మందులు పథ్యపానాదులు మొదలగు వాని కగు కర్చుల నష్టమును ఈలెక్కలో చేరలేదు.

ఈ ప్రకారముగా ఇంతిం తనరాని ధననష్ట మును శరీరారోగ్య నష్టమును కలుగజేయుచుం డెడు ఈ జ్వరమునుగూర్చి ఎంతవ్రాసినను వ్రాయ వచ్చును. తమకు తెలియని విషయములలో తమ బాగుకొరకు ఎవరైన ఏదైనచెప్పిన విశ్వసించి తమ తప్పులనుదిద్దుకొను స్వభావము మన ప్రజలయందు కొంచెమయినను కానరాదు. తమకు వంశపారం పర్యముగా తాతల నాటినుండి వచ్చు మూఢవిశ్వా సమును విడువరు.

ఒకానొక విధమైన పురుగు నీటి మూలమున మనశరీరములో ప్రవేశించుటచే 'కలరా' అను వ్యాధి కలుగుచున్నదని అజ్ఞానియగు కాపువానికి

చెప్పిన "కాదు కాదు, అమ్మవారు" అనును. ఒకకాలో చేయిరో ఉపద్రవముగ వాచినప్పుడు నీ శరీరములో ఒకానొక విధమైన సూక్ష్మజీవులు ప్రవేశించి నీ రక్తమును చెరుచుటచే నీకు కురుపు వేయుచున్నదని చెప్పిన "కాదు కాదు, మంత్రము" అనును; లేదా "మా పొరుగింటివాడు ప్రయోగము చేసెను" అనిచెప్పును. అమితమైన చలి కుదుపుచే వడకుచు ఇంటిలో నున్నదుప్పట్లు అన్నియు కప్పుకొను నొకరోగియొక్క శరీరమంతయు 15 నిమిషములలోపల తహతహమండుచున్నట్లు చేయుమార్పు జ్వరలక్షణమనియు, ఈ జ్వరము దోమకాటు మూలమున మన నెత్తుటిలో ప్రవేశించు నొకానొక పురుగువలన కలుగుచున్నదనియు చెప్పిన యెడల "కాదు కాదు, దయ్యము" అనును. ఇట్టి నమ్మకము చదువెరుగని జనసామాన్యమునందేగాక బి.ఏ,ఎం.ఏ. పరీక్షలలో తేరినామని చెప్పుకొను జ్ఞానులలో కూడ ననేక చోట్ల గమనించియున్నాను. ఇట్టి అజ్ఞానము దేశమంతటను వ్యాపించి యుండుటకు వైద్యులే కారకులని నానమ్మకము. ఒక వ్యాధిని గుర్తెరిగిన వైద్యునకు ఆ వ్యాధిని కుదిర్చినంతమాత్రమున తన పని తీరలేదు. తన సాటి ప్రజలకు ఆ వ్యాధి

యొక్క వ్యాపకమును గూర్చియు దానిని తప్పించు కొను మార్గమును గూర్చియు వివరముగ బోధింపక పోవుట మన దేశమునందలి వైద్యులలోపము.

వైద్యుల లోపము.

ఈ విషయముల యందు సర్కారువారు అంతగా సాయము చేయజాలరు. ఒకవేళ సాహసించి చేయబూనినను వారిఉపదేశములు ప్రజలకంతగా హితవుగా నుండవు. ఇందుకు ఉదాహరణమేమన:—

సర్కారువారి ఉపదేశము ప్రజలకు హితవుగా నుండదు.

మునిసిపల్ జవానువచ్చి కలరారోగిగల ఒక ఇంటియందలి వారికి "రోగినందరును తాకకూడదు; ప్రత్యేకముగా నొక గదిలోనుంచి వైద్యముచేయవలెను" అనిచెప్పి నప్పుడును "మీ యింటనుండు చలిజ్వరమునకు మీ పెరటిలోని పాడునూతిలో నున్న దోమలే కారణము. ఆ నూతిని పూడ్చిన మీకు జ్వరములురావు" అని చెప్పినప్పుడును ఆజవానుచేసిన హితోపదేశమునకు ప్రత్యుపకారముగా రెండుతిట్లుతిట్టి తలుపులు మూసికొందురు. ఇట్టిప్రజలకు నచ్చజెప్పి బోధించుట కేర్పడిన శానిటరీ ఇనస్పెక్టర్లు నేకులు ప్రజలతో కలసి మెలసియుండి తగినరీతిని బోధచేయుటకు బదులుగా తమ యధికారమును చెలాయించుచు వీధులలోనున్న బండ్లజాబితాలు తయారుచేయించి న్యూసెన్సు క్రిందచేర్చి

బెదిరించుచు మునసపు కరణముల ద్వారా రాయ భారములనంపుచు కరణముల ఇండ్లలో విందుభోజనము లారగింపుచుందురు.

కావున ప్రజలజ్ఞానాభివృద్ధి చేయుభారము శాస్త్రజ్ఞానముగల వైద్యులదేకాని సర్కారువారి దంతగాకాదు. ఈవిషయమై ప్రజలకుకావలసిన సామాన్య విషయములను బోధించు నిమిత్తము ఆరోగ్య మనుపేర నొక మాసపత్రికను సాగింప బూనితిని గాని తగినంత ప్రోత్సాహము కనబడక పోవుటచేతను ఒక్కొక విషయమై పెక్కుసంచికలలో ముక్కలుముక్కలుగా వ్రాయుటకంటె ఒక్కొక విషయమునుగూర్చి ప్రత్యేకముగా నొక్కొక చిన్నపుస్తకమును ప్రచురించిన నది శాశ్వతముగా నుపయోగపడునని తలచుటచేతను ఈచిన్న పుస్తకమును వ్రాయబూనితిని.

మన దేశమునందు జనన మరణముల లెక్కలలో వ్యాధులను క్రమముగ పేర్కొనుట లేదు. ఈ రిజస్టర్లను తయారుచేయు గ్రామాధికారికి దేహాఖాయిలా, జ్వరము, విరేచనములు, అను ఈ 3. బాపతుల వ్యాధులుతప్ప తక్కినవి తెలియవు. ఈ బాపతుల క్రిందనైనను తనపైయుద్యోగస్థుడు గ్రామమునకు వచ్చిన దినముననే వినికినిబట్టి వ్రాయు

ను గాని ఏదినమున కాదినము సరియయిన కార ణమును విచారించి తనకు తెలిసినంత వరకైనను వ్రాయుటలేదు. జాగ్రత్తగా వ్రాయవలెనని తల చెడు గ్రామాధికారికి గూడ ఏయేవ్యాధులు ఏయే తెగల క్రిందచేరునో తెలిసికొనుటకు ఆధారములు లేవు.

కావున ఈ పుస్తకములో మొదటి ప్రకరణము నందు వివిధ జ్వరములకుగల భేదములను తెలుప బూనియున్నాను. ఇందుకొరకు ఆయాజ్వరములచే బాధపడిన రోగుల చరిత్రములను సంక్షేపముగ పటముల రూపకముగ వ్రాయించి ప్రత్యేకముగ తయారు చేయించితిని.

జ్వర భేదములు.



1-వ పటము: జ్వరపుపుల్ల.

వివిధ జ్వరభేదములను సరిగా తెలిసికొనవలె నను నెడల 1-వ పటములో చూపబడిన జ్వరపు పుల్ల*యను నొక గాజుగొట్టముతో రోగియొక్క శరీర వేడిమిని కొలవవలెను. ఈపుల్లయందు మధ్య భాగమున తలవెండ్రుక కంటె సన్నముగ నుండు

జ్వరపు పుల్ల.

* జ్వరపుపుల్ల:—దీనికి ఇంగ్లీషులో థర్మామీటరు అనిపేరు.

గొట్టముకలదు. ఆ గొట్టములో మొదటి భాగము లావుగనుండి పాదరసముతో నింపబడి యుండును. ఈ పాదరసము వేడితగిలినప్పుడు హెచ్చి గొట్టము పొడుగునను ప్రాకును. చలి తగిలినప్పుడు ముడుచుకొని గొట్టము అడుగునకు దిగును. ఎంతెంత వేడికి గొట్టములోని పాదరసము ఎంతెంత హెచ్చునో కనిపట్టి ఈ మార్పులను సరిగా కొలచు నిమిత్తమై జ్వరపు పుల్లయొక్క పైభాగమును 95 మొదలు 110 వరకు 15 మెట్లుగా విభజించి యున్నారు. ఈ మెట్లనే డిగ్రీలు లేక అంశములు అందురు.

ఒకరోగియొక్క జ్వరతీవ్రమును కొలవవలెననిన జ్వరపు పుల్లయొక్క మొదటిభాగమును సాధారణముగా నారోగియొక్క నోటిలో నాలుక క్రిందపెట్టి ఒక నిమిషమువరకు ఉంచవలెను. లేదా రోగియొక్క చంకలో చెమట లేకుండునట్లు తుడిచి జ్వరపు పుల్లయొక్క మొదటిభాగము చక్కగ నన్నిప్రక్కలను తాకునట్లుగ చంకలోపెట్టి భుజమునుప్రక్కకు అంటి యుండునట్లుగా నదిమి పెట్టవలెను. రోగికి స్మృతితప్పి యున్నప్పుడును చంటిబిడ్డల జ్వరమును తెలిసికొన వలసి యున్నప్పుడును జ్వరపు పుల్లను ఆసనములోపెట్టి జ్వరమును కొలుచుట మంచిది.

జ్వరపు పుల్లలలో ననేక భేదములు కలవు. కొన్ని అరనిమిషములోనే జ్వరమును సరిగా తెలుపు

ను. మరికొన్ని అయిదునిమిషములకుగాని తెలుప జాలవు. ఒకసారి జ్వరమును కొలిచిన తరువాత తిరిగి జ్వరమును కొలవకముందు జ్వరపు పుల్లను క్రిందివైపునకు ఝాడించి దానిలోని పాదరసమును క్రిందికి దింపవలెను.

సామాన్యముగా మన శరీరముయొక్క వేడిమి 98½ తొంబది ఎనిమిదిన్నర డిగ్రీలు ఉండును. అది క్రింది 2-వ పటములలో 98, 99 అంకెల మధ్య నుండు దళమైన నల్ల గీటువలన చూపబడినది. ఈ గీటునకు సామాన్యరేఖ (Normal) అనిపేరు. సామాన్యరేఖ

పేరు-వెంకయ్య. వయస్సు 24 సంవత్సరములు.




2-వ పటము.

2-వ పటములో పైకి, క్రిందికి ఎక్కుచు దిగుచు నున్నట్లు గీయబడిన గీటు జ్వరముయొక్క హెచ్చు తగ్గులను తెలియజేయును. ఈ గీటు, క్రిందికి దిగు సమయమున జ్వరము తగ్గుచున్నట్లును, గీటుపైకి ఎక్కుచున్న సమయమున జ్వరము హెచ్చుచున్నట్లును ఎంచవలెను. ఈపటములో 96, 97, 98, మొదలగు సంఖ్యలు శరీరముయొక్క వేడి యెన్నిడిగ్రీలు ఉన్నదో తెలుపుసంఖ్యలు. ఈపటములో పై భాగమునఉన్న 1,2,3 మొదలగు అంకెలు తేదీలను తెలియజేయును. 'ఉ' అనునది ఉదయమును 'సా' అనునది సాయంకాలమును తెలియజేయును.

శరీరముయొక్క వేడిమి 100 లేక 101 డిగ్రీల వరకు ఉండిన కొంచెము జ్వరముతగిలినట్లు ఎంచుదుము. ఈవేడిమి 103 లేక 104 వరకు ఉండిన హెచ్చు జ్వరమనియు 106 లేక అంతకంటె హెచ్చుగ నుండిన విపరీత జ్వరమనియు చెప్పుదుము. శరీరము యొక్క వేడి 97 డిగ్రీల వరకు దిగినయెడల దేహము మిక్కిలిచల్లగా నున్నదనియు 96 లేక 95 డిగ్రీలకు దిగినయెడల మిక్కిలి శీతలముగ నున్నదనియు చెప్పుదుము. జ్వరము 107 డిగ్రీలకుమించిపోయినను శీతలము 95 డిగ్రీలకంటె దిగిపోయినను జీవించుట దుర్లభము.

రెండవపటములో వెంకయ్యకు 1 తేది సాయం
కాలము 105 డిగ్రీలకంటె హెచ్చుగ జ్వరమువచ్చి
నట్లు చూపబడినది. ఆ దినము ఉదయమున ఎంత
ఉన్నదో చూడలేదు. రెండవ తేది ఉదయమునకు
ఆజ్వరముతగ్గి 97 డిగ్రీలకు వచ్చియున్నది. అనగా
సామాన్యముగా మనశరీరమునకుండు వేడిమికంటె
తగ్గియున్నది. 2, 3, 4-వ తేదీలలోకూడ మధ్యా
హ్నమున జ్వరము 105 డిగ్రీల వరకు హెచ్చి
యున్నది.

3-వ పటములో సుబ్బన్నకు 1-వ తేదిని జ్వరము
105 డిగ్రీల కంటె కొంచెము తక్కువగా వచ్చియు
న్నది. 2, 4 తేదీలను జ్వరమురానేలేదు. 3-వ తేదిని
రమారమి 105 వరకును 5 తేదీని 103 వరకును
వచ్చియున్నది.

వెంకయ్యకు 4-వ తేది సాయంకాలమునను,
సుబ్బన్నకు 5-వ తేది ఉదయమునను క్వయినా
ఇయ్యబడినది. (2,3 పటములను చూడుము) వెంక
య్యకు 5-వ తేది సాయంకాలమున రావలసినజ్వర
ము రాలేదు. శరీరవేడిమి 99 డిగ్రీలవద్దనే నిలిచి
పోయినది. సుబ్బన్నకు 5-వ తేదీ సాయంకాలము
మామూలు ప్రకారము 105 డిగ్రీలవరకు రావలసిన

పేరు-సుబ్బన్న. వయస్సు 40 సంవత్సరములు.




3-వ పటము.

జ్వరము 103 డిగ్రీలవరకే వచ్చినది. వరుస ప్రకారము 7-వ తేదీని రావలసిన జ్వరము రానేలేదు. శరీరవేడిమి 99 డిగ్రీలవద్ద నిలిచియున్నది.

**క్వయినా యొక్క గుణము.**

పై పటములను పట్టిచూడగా వెంకయ్యకు దినదినము వచ్చుజ్వరమును, సుబ్బన్నకు దినము విడిచి దినమువచ్చు జ్వరమును, క్వయినా తీసికొనిన వెంటనే తగ్గిపోయినట్లు కనబడుచున్నది.

పేరు-రామన్న. వయస్సు-37 సంవత్సరములు.




4-వ పటము.

పైని చూపబడిన నాల్గవపటములోని రామన్నకు, 1, 4, 7 తేదీలను అనగా రెండు దినములు విడిచి మూడవదినము జ్వరమువచ్చుచున్నట్లు కనబడుచున్నది.

మూడుదినములకొకసారివచ్చు జ్వరము.

పేరు-సుబ్బారాయుడు. వయస్సు-21 సంవత్సరములు.




5-వ పటము.

ఈ పటములో సుబ్బారాయునికి మొదటి నాలుగు తేదీలను ప్రతిదినమును జ్వరమువచ్చుచున్నట్లును 1, 3 తేదీలను 105 డిగ్రీలవరకును 1, 4, 6, 8 తేదీలను 103, 104 డిగ్రీల మధ్యవరకును వచ్చుచున్నట్లును కనబడుచున్నది. క్వయినావలన దినదినమువచ్చు జ్వరము దినము విడిచి దినము వచ్చు జ్వరముగా మారుచున్నది.

పేరు-వెంకట రత్నము. వయస్సు-30 సంవత్సరములు.




6-వ పటము.

పై పటములోని వెంకటరత్నమునకు ఈ దినము ఆదినము అను వివరము లేకుండ కొన్ని దినములు జ్వరమువచ్చుటయు, మరికొన్ని దినములు శరీరమున మిక్కిలిశీతలము గ్రమ్ముటయు మీరు చూడగలరు. ఈజ్వరము ఎంత క్వాయినా ఇచ్చినను లొంగలేదు.

పేరు-నరసింహాము. వయస్సు-23 సంవత్సరములు.




7-వ పటము.

ఎల్లప్పుడు విడువకుండు జ్వరము.

ఏడవ పటములోని నరసింహామునకు మొదటి తేదిని 100 డిగ్రీలవరకును, రెండవ తేదిని 101 వరకును, మూడవ తేదిని 102 డిగ్రీలవరకును నాలుగవ తేదిని 104 వరకును జ్వరము వచ్చి ఒక దినమునకంటె మరియొక దినమున నిచ్చెనమెట్లవలె హెచ్చుచు వచ్చినది. పిమ్మట 4-వ తేది మొదలు 11-వ తేది వరకు 102, 104 డిగ్రీలమధ్య నిలుకడగా నిలిచియున్నది. 12-వ తేది మొదలు జ్వరముదిగు

టకు ప్రారంభించి 17-వ తేది నాటికి 98 డిగ్రీలకు వచ్చియున్నది. మొదటి తేది మొదలు 17-వ తేదివరకు జ్వరము ఒక్కనాడైనను 98½-కు అనగా సామాన్య శరీరవేడిమికి దిగలేదు. ఈ జ్వరమునకు క్వయినా ఇచ్చుటవలన ప్రయోజనము కనబడలేదు.

1. పైని చెప్పబడిన రోగులకు ఆరు గురికి వచ్చిన జ్వరము వేరువేరు జాతిజ్వరములా లేక ఒకటే విధమైన జ్వరమా?

2. మొదటి ఇద్దరికిని క్వయినా ఇచ్చిన తోడనే జ్వరము నిలుచుటయేమి? 4-వ పటము లోని వానికి క్వయినా ఇచ్చుటచేత ఒకదినము జ్వరము విడిచి మరుసటిదినము జ్వరము విడువక పోవుటకు కారణమేమి?

3. పైని చెప్పబడిన జ్వరములు, క్రమముతప్పకుండ ఒకనికి దినదినమును, మరియొకనికి దినము విడిచి దినమును, ఇంకొకనికి 3 దినముల కొకసారియు వచ్చుటకును, 5-వ పటములోని వానికి ఏ విధమైన క్రమము లేకుండవచ్చుటకును ఏవైనను కారణము లున్నవా?

4. పైని 2,3,4,5,6 పటములలో జూపబడిన రోగులకు జ్వరము విడిచి విడిచి వచ్చుచుండెను.

ప్రతిదినము కొంతకాలము కొందరకును, నడుమ నడుమ నొకటి రెండు దినములు కొందరకును, బొత్తిగ జ్వరము లేకయుండెను. 6-వ పటము లోని రోగికి 1-వ తేదిని వచ్చిన జ్వరము 17-వ తేది వరకు నొక్క క్షణమైన విడువక నిలుకడగా నుండెను. ఇట్లు ఎల్లప్పుడును విడువకుండు జ్వరములకును విడిచి విడిచివచ్చు జ్వరములకును గల భేదమేమి ?

ఈ విషయములన్నియు ముందు ప్రకరణములలో వివరింపబడును.

# రెండవ ప్రకరణము

## చలిజ్వరముయొక్క పూర్వచరిత్ర

చలిజ్వరమునకు (1) మన్యపు జ్వరము (2) వరుసజ్వరము (3) శీతకాల (శీతకట్టు) జ్వరము అని మూఁరు పేర్లు. ఈ జ్వరమునకు ఇంగ్లీషున మలేరియా (Malaria) అని పేరు.

మన్యపుజ్వరము :-మన్యములనగా అడవిప్రదేశములు. అచ్చట ఈజ్వరము హెచ్చుగ వ్యాపించియుండును. కనుక ఈ జ్వరమును మన్యపు జ్వరమందురు. కాని ఇప్పుడీజ్వరము నిజమయిన అడవులనుండి చెన్నపట్టణము బొంబాయి మొదలగు మహా పట్టణములను నివాసస్థానముగా నేర్పరుచుకొనుటచేత దీనికి ఈ పేరు నిరర్థక మగుచున్నది.

వరుసజ్వరము :-దినమువిడిచి దినముగాని, దినదినముగాని, క్రమముతప్పక వచ్చుచుండుటచే నీ జ్వరమునకు చెన్నపట్టణపు ప్రాంతములందు వరుసజ్వరమని పేరు.

మలేరియా :—ఈపదమునకు ఇంగ్లీషుభాషలో చెడుగాలి అని వ్యుత్పత్త్యర్థము. ఈజ్వరము బురద గుంటలు మొదలగు వానినుండివచ్చు చెడుగాలిని పీల్చుటవలన కలుగుచున్నదని ఆంగ్లేయులు కొంత కాలముక్రిందట నమ్మియుండిరి. అందువలన దీనికి మలేరియా అని పేరుపెట్టిరి. కాని క్రింద మీరు చదువబోవు ప్రకారము ఈజ్వరమునకు ముఖ్య కారణము దోమకాటని స్పష్టపడి యున్నందున మలేరియా అను పేరుగూడ నిరర్థకము.

దోమజ్వరము :-కొందరు దీనికి దోమజ్వర మని పేరుపెట్టిన బాగుగనుండునని తలచిరి.

కాని చలిజ్వరమన్న పేరు అనేక ప్రదేశములలో తరుచుగ వాడుకలో నున్నందునను, సాధారణము గా ఈ జ్వరమునకు ముఖ్యచిహ్నములు చలియు జ్వరమును అయి యున్నందునను, చలిజ్వరమను పేరే వాడుచున్నాను.

శీతకాల జ్వరము :—శీతకాలమునందు అనగా నవంబరు, డిశంబరు, జనవరి నెలలలో ప్రబలి యుండుటచే ఈజ్వరమునకు శీతకాల (శీతకట్టు) జ్వర మనియు కొన్నిచోట్ల పేరుగలదు.

(1) నియమితకాలమునకు జ్వరమువచ్చుట :— ఏదో యొకక్రమమున ప్రతిదినమునగాని దినమువిడిచిదినముగాని, రెండుదినములు విడిచి మూడవ దినమునగాని, జ్వరమువచ్చుట. అనగా జ్వరము వచ్చినదిమొదలు 24 గంటలకుగాని, 48 గంటలకుగాని, 72 గంటలకుగాని తిరిగి జ్వరమువచ్చుట.

(2) విడిచి విడిచి జ్వరము వచ్చుట:—ఒకనాటి జ్వరమునకును మరియొకనాటి జ్వరమునకును మధ్య కొంతకాలము జ్వరములేకుండ నుండుట.

(3) జ్వరము సాధారణముగా చలితో ప్రారంభించి చెమటతో విడుచుట.

(4) రక్తహీనము, జ్వరపుగడ్డ, మొదలగునవి దీర్ఘ జ్వరములచే కలుగుట.

ఇవి ఈ వ్యాధియొక్క ముఖ్య చిహ్నములు.

(1) పూర్వ చరిత్ర:—

మన దేశపు వైద్యులు పూర్వకాలమునందు ఈ జ్వరములను గుర్తించి యున్నారు. ఈ జ్వరములను మనప్రాచీన గ్రంథములలో విషజ్వరములని వాడి యున్నట్లు తోచుచున్నది. ఈ విషయమై వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యుల వారిచే ఆంధ్రవ్యాఖ్యాన సహితముగ ప్రచురింపబడిన 'మాధవ

నిదానము ' నుండి కొన్ని భాగములను క్రింద కన బరుచు చున్నాను.

విషమజ్వర భేదములు.

"శ్లో॥ సన్తత స్సతతోఽన్యేద్యు
స్తృతీయక చతుర్థకౌ॥

తా॥ సన్తత జ్వరమనియు, సతత జ్వరమనియు, అన్యేద్యుష్క జ్వరమనియు, తృతీయకజ్వరమనియు, చతుర్థక జ్వరమనియు, విషమజ్వరము ఐదువిధంబులై యుండునని భావము.

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము అనుధాతువుల నాశ్రయించి యున్న వాత,పిత్త, శ్లేష్మములను దోషముచే నీజ్వరములు గలుగుచున్నవని చెప్పబడి యున్నది.

శ్లో॥ సన్తతంరసరక్తస్థః।సోన్యేద్యుః పిశితాశ్రితః
మేదోగత స్తృతీయేహ్ని। అస్థిమజ్జగతఃపునః
కుర్యాచ్చతుర్థకంఘోరం। అన్తకం రోగ
[సఙ్కరం॥

తా॥ సంతత జ్వరము రసధాతువు నాశ్రయించి జనించుననియు, సతతజ్వరము రక్తధాతువు నాశ్రయించిజనించుననియు, అన్యేద్యుష్కంబనుజ్వరము మాంసము నాశ్రయించి జనించుననియు, తృతీయక జ్వరము మేదస్సు నాశ్రయించి జ్వరమువ్యాపిం

చిన దినమునకు మూడవ దినము నందు వరుసగా వచ్చుననియు, అస్థిమజ్జల నాశ్రయించి జ్వరము వ్యాపించినదినమునకు నాల్గవదినమున మరల వ్యాపించునది చతుర్థక జ్వరమనియు భావము. అట్టి చతుర్థక జ్వరము ఓరువ నశక్యమై యమునిబోలె ప్రాణముల హింసించుచు అనేకరోగముల గలిగించును. మరియు చరకమున:—

'రక్తధాత్వాశ్రయఃప్రాయోదోష స్సతతకంజ్వరం.'

"రక్తధాతువు నాశ్రయించి సతతక జ్వరము తరుచుగ జనించును." అని యుండుటంజేసి ప్రకృత మూలమున "సంతతః" అనుపదము "సతత" అను పదమునకుగూడ నుపలక్షణంబుగాన సతతజ్వరము రక్తధాతువు నాశ్రయించి యుండుననే యర్థము లభించెనని యెరుంగునది.

శ్లో॥ సప్తాహంవా దశాహంవా ద్వాదశాహమథాపివా। సన్తత్యాయోవిసర్గస్యాత్సన్తతస్సనిగద్యతే॥

తా॥ ఏడుదినముల కాలమైనను పదిదినములకాలమైనను పదిరెండు దినముల కాలమైనను ఒకక్షణకాలముగూడ విడువక అనుసరించియుండు జ్వరము

సంతత జ్వరము.

సంతత జ్వరమనంజను. ఇచ్చట దోషత్రయ ప్రకో పముచే జనించిన సన్తత జ్వరమునందు వాతము అధికముగ నున్నచో ఏడుదినముల వరకు జ్వరము విడువక అనుసరించి యుండుననియు, పిత్తము అధి కముగ నుండునపుడు జనించినజ్వరము పదిదినముల వరకు నిరంతరముగ వ్యాపించియుండు ననియు, కఫము అధికముగ నుండునపుడు కల్గినజ్వరము పదిరెండు దినములవరకు ఎడలేక యుండుననియు అర్థము.

సతతక అన్యేద్యుష్క తృతీయక చతుర్థక జ్వర లక్షణములు.

శ్లో॥ అహోరాత్రే సతతకో ద్వౌకాలావనువర్తతే।
అన్యేద్యుష్కస్త్వహోరాత్ర ఏకకాలం ప్రవ [ర్తతే।
తృతీయకస్తృతీయేహ్ని చతుర్థేహ్ని చతుర్థకః॥

సతతక జ్వరము.

తా॥ రాత్రిపగలు ఈ రెండుకాలములయందును జ్వరవేగమును జూపునది సతతక జ్వరమనంజను. అనగా పగటియందు జ్వరము వ్యాపించి సాయం కాలమున శమించి మరల రాత్రియందు జ్వరవేగ మును జూపునది సతతక జ్వరమని భావము. రాత్రి

అన్యేద్యుష్క జ్వరము.

యందైనను పగటియందైనను ఒకకాలమున వ్యా

పించునది అన్యేద్యుష్క-జ్వరమని చెప్పందగును.
జ్వరవేగము కల్గిన దినము మొదలు మూడవనాడు మరలవ్యాపించునది తృతీయక జ్వరమనందగు. జ్వర వేగముకల్గిన దినమునకు నాల్గవనాడు వ్యాపించునది చతుర్థక జ్వరమనందగు. ఇచట పగలు రెండుకాలములయందును రాత్రి రెండుకాలముల యందును వ్యాపించు జ్వరము సతతక జ్వరమనియు, పగలు ఒక కాలమునందును రాత్రియొక కాలమునందును వ్యాపించునది అన్యేద్యుష్క జ్వరమనియు కొందరు వచించెదరు.

తృతీయక జ్వరము.

చతుర్థక జ్వరము.

మతాంతరమున విషమజ్వర లక్షణము:-

శ్లో॥ కేచిద్భూతాభిషఙ్గోత్థం
బ్రువతే విషమజ్వరమ్॥

తా॥ కొందరు భూతసంబంధమువలన జనించిన జ్వరమునకు విషమజ్వరమని వచించెదరు.

శ్లో॥ కఫపిత్తాత్త్రిక గ్రాహీపృష్ఠాద్వాతకఫాత్మకః
వాతపిత్తాచ్ఛిరోగ్రాహీ త్రివిధస్స్యాత్తృతీయకః॥

తా॥ కఫపిత్తములు అధికములై యున్నప్పుడు జనించిన తృతీయక జ్వరము తొలుత వెన్నెముకకు క్రిందిభాగమున వేదనను కల్గించి శరీరమున వ్యాపిం

తృతీయక జ్వరభేదములు

చును. వాతకఫములు అధికములై యుండునప్పుడు జనించు తృతీయక జ్వరము తొలుతవీపునందు వేదనను కల్గించి శరీరమున వ్యాపించును. వాతపిత్తములు అధికంబులై యుండునపుడు జనించు తృతీయక జ్వరము తొలుత శిరస్సునందు వేదనగల్గించి పిమ్మట శరీరమున వ్యాపించును. ఇత్తెరంగున తృతీయక జ్వరము మూడువిధంబులై యుండును.

చతుర్థక జ్వరభేదము.

శ్లో॥ చతుర్థకోదర్శయతి ప్రభావం ద్వివిధంజ్వరః।
జఙ్ఘాభ్యాంశ్లేష్మకః పూర్వంశిరస్తోనిలసంభవః॥

తా॥ వాతపిత్త కఫములలో కఫ మధికముగ నున్నపుడు జనించుచతుర్థక జ్వరము తొలుతపిక్కలయందు నొప్పిని కల్గించి పిదప శరీరమున వ్యాపించును. వాతము అధికముగ నుండునపుడు జనించు చతుర్థక జ్వరము తొలుత శిరస్సున వేదన కల్గించి పిమ్మట శరీరమునవ్యాపించును. ఇత్తెరంగున రెండు విధంబులైన శక్తిని చతుర్థక జ్వరము జూపునని భావము.

రసగత జ్వర చిహ్నములు.

శ్లో॥ గురుతా హృదయోత్క్లేశ
స్సదనం ఛర్ద్యరోచకౌ।
రసస్థేతుజ్వరేలిఙ్గం
దైన్యంచాస్యోప జాయతే॥

తా॥ జ్వరము రసగతంబైన యపుడు శరీరము భారముగా నుండుట, రొమ్మడపు, అవయవములు శిథిలంబులై యుండుట, వమనము, అరుచి, మనస్సున క్లేశము గల్గుట, ఇట్టి చిహ్నములుగల్గును. మున్నువచించిన వాతపిత్త కఫములచే జనించిన నానావిధ జ్వరములను ఈలక్షణములచేత రసగతంబులని యెరింగి రసాదిధాతువులకు విరోధము గల్గనీయక నాయాజ్వరమునకు చికిత్స జేయవలెనని భావము. క్రిందజెప్పబడు రక్తాది ధాతువుల యందును ఈరీతిగనే యెరుంగునది.

రక్తగతజ్వర లక్షణము.

శ్లో॥ రక్తనిష్ఠీవనందాహో
మోహశ్ఛర్దిర్విభ్రమః।
ప్రలాపః పీడకాతృష్ణా
రక్తప్రాప్తేజ్వరేనృణామ్॥

తా॥ రక్తమును ఉమియుటయు, తాపము, మూర్ఛ, వమనము, ఒడలుతిరుగుట, అనర్థముగ మాటలాడుట, శరీరమున బొబ్బలు లేచుట, దప్పి, ఈలక్షణములు రక్తగతమైన జ్వరమునందు మనుజులకు కల్గును.

మాంసగత జ్వరలక్షణము

శ్లో॥ పిణ్డికోద్వేష్టనం తృష్ణా
సృష్టమూత్రపురీషతా।

ఉష్ణాన్త ర్దాహవిక్షేపౌ
గ్లానిస్స్యాన్మాంసగేజ్వరే॥

తా॥ పిక్కల యందుండు మాంసమున కఱ్ఱల తో గొట్టిన రీతిగ బాధగల్గుట, దప్పి, మూత్రపు రీషము లధికముగా బైలు వెడలుట, ఒడలుమిగుల వేడిగానుండుట,శరీరమునకు లోపల తాపముగల్గుట, హస్త పాదాద్యవయవములను చలింప చేయుట, శరీరము బడలియుండుట, ఈలక్షణములు మాంస గతమైన జ్వరమునందు విశేషముగ కలుగును.

మేదోగత జ్వరలక్షణము

శ్లో॥ భృశం స్వేదస్తృషా మూర్ఛా
ప్రలాపశ్ఛర్ది రేవచ।
దౌర్గంధ్యారోచకౌగ్లాని
ర్మేదస్థే చాసహిష్ణుతా॥

తా॥ మేదోగతమైన జ్వరమునందు మిక్కిలి చెమటయు, దప్పియు, మూర్ఛయు, అర్థములేక అధికముగా మాట్లాడుటయు, వాంతియు, శరీర మున దుర్గంధంబును, అరుచియు, బడలికయు, బాధల నోర్వజాలకుండుటయు ఈలక్షణములు కలుగును.

అస్థిగత జ్వర లక్షణము.

శ్లో॥ భేదోస్థ్నాం కూజనం శ్వాసో
విరేకశ్ఛర్ది రేవచ।

విక్షేపణంచ గాత్రాణాం
ఏతదస్థిగతేజ్వరే॥

తా॥ అస్థిగతమైన జ్వరమునందు అస్థులలో విరిగినట్లు నొప్పిగల్గుట, కంఠమునకూతలు బుట్టుట, శ్వాసంబధికమగుట, విరేచనము, వాంతి, చేతులు, కాలు మొదలయిన అవయవములను కదలించుట ఇట్టిలక్షణములు కలుగును.

మజ్జగత జ్వర లక్షణము.

శ్లో॥ తమః ప్రవేశసం హిక్కా
కాసశ్శైత్యంవమిస్తథా।
అన్తర్దాహో మహాశ్వాసో
మర్మభేదశ్చమజ్జగే॥

తా॥ మజ్జగతమైన జ్వరమునందు చీకటిలోప్రవేశించినట్లు కన్నులుగానరాకుండుట, వెక్కిళ్లు, దగ్గు, చలి, వాంతి, అన్తశ్శరీరమున తాపముగల్గుట, శ్వాసాధికారమున జెప్పంబడు మహాశ్వాసము, మర్మంబుల భేదించినరీతిగ బాధగల్గుట ఈ లక్షణములు గల్గును.

శుక్రగత జ్వర లక్షణము.

శ్లో॥ మరణం ప్రాప్నుయాత్తత్ర
శుక్రస్థానగతేజ్వరే।
శేఫస స్తబ్ధతా మోక్షః
శ్శుక్రస్యతు విశేషతః॥

తా॥ శుక్రస్థానమును పొందిన జ్వరమునందు మేఢ్రము స్తంభించి యుండును. శుక్రం బధికముగా స్రవించును. రసాదిధాతువులలో శుక్రగత జ్వరము నందు మనుజుడు మృతుండగును.

రసాది ధాతుగత జ్వరములలో సాధ్యాసాధ్య నిర్ణయము.

శ్లో॥ రసరక్తాశ్రితస్సాధ్యో మాంసమేదో గతశ్చయః।
అస్థిమజ్జగతః కృచ్ఛ్రశ్శుక్రస్థస్తునసిధ్యతి॥

తా॥ మున్ను చెప్పిన రసాదిగత జ్వరములలో రస రక్త మాంసమేదోగత జ్వరములు సాధ్యం బులై యుండును. అస్థిమజ్జల నాశ్రయించిన జ్వర ములు కష్టసాధ్యంబులై యుండును. శుక్రగత మైన జ్వరము సాధ్యంబుగాదు.

శ్లో॥ బలవత్స్వల్పదోషేషు
జ్వరస్సాధ్యో నుపద్రవః॥

సాధ్య జ్వర లక్షణము.

తా॥ మిక్కిలి బలవంతులైన మనుజులకు స్వల్పంబులైన వాతాది దోషములచే జనించిన జ్వరము కానుపద్రవములు లేకున్నయెడ అట్టి జ్వరము సాధ్యంబై యుండును. జ్వరోపద్రవములు గ్రంథాంతరమునం దీరీతిగనున్న యవి:—

'కాసోమూర్ఛారుచిశ్ఛర్దిస్తృష్ణాతీసారవిడ్గ్రహాః। హిక్కాశ్వాసాఙ్గభేదాశ్చ జ్వరస్యోపద్రవాదశ॥'

దగ్గు, మూర్ఛ, అరుచి, వాంతి, దప్పి, అతిసారము, మలబంధము, వెక్కిళ్లు, శ్వాసము, ఒళ్లునొప్పులు, ఈపదియు జ్వరమునందు గల్గు నుపద్రవంబులని భావము.

శ్లో॥ హేతుభిర్బహుభిర్జాతో బలిభిర్బహులక్షణః। అసాధ్య జ్వర లక్షణము.
జ్వరః ప్రాణాన్తకృద్యశ్చశీఘ్రమింద్రియనాశనః॥

తా॥ మిక్కిలి బలయుక్తంబులైన అనేక హేతువులచే జనించి అనేక చిహ్నములుగల జ్వరంబును, జనించినతోడనే త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియ పంచకములు; వాక్పాద పాణి పాయూపస్థలను కర్మేంద్రియములు; మనస్సు; ఈపదునొకం డింద్రియములను స్వవిషయములయందు ప్రవర్తింప నీయక నశింపంజేయు జ్వరము ప్రాణాంతకరంబగును; అసాధ్యంబని భావము."

పైన వివరింపబడిన జ్వరలక్షణము లన్నియు విషమ జ్వరములలో చలిజ్వరములు.
ఇప్పుడు వ్యాపించియుండు చలిజ్వరములలో క్రమముగ కానుపింపకపోయినను ఈ జ్వరములుకూడ జేరియున్నవి.

వరుసక్రమమున ప్రతిదినము నిర్ణీత కాలమునందు గాని, దినము విడిచి దినముగాని, మూడు దినముల కొకసారిగాని, నాల్గుదినముల కొకసారిగాని వచ్చుచుండుటచే, పూర్వకాలపువైద్యులచేవివరింపబడిన జ్వరములలో ఈ చలిజ్వరములు చేరియున్నవని నిర్ధారణచేయక తప్పదు.

కాని ఈ జ్వరములకు కారణము మన ప్రాచీన శాస్త్రిజ్ఞులు చెప్పినట్లు కాదనియు దోమకాటుచే మనశరీరములో ప్రవేశించెడి యొకానొక సూక్ష్మమైన వృక్షజాతి ప్రాణియనియు ఇటీవలి ఐరోపా దేశపు వైద్యులు కనిపెట్టియున్నారు. ఈ విషయమై క్రింద వివరింపబడును.

ఐరోపాఖండమునందలి చలిజ్వరము.

2. ఐరోపాఖండమునందు అనాది నుండి దక్షిణభాగమున నీజ్వరములు అమితముగ నుండు గ్రీసు దేశమునందు హిపొక్రెటీసు (Hippocrates) మొదలగు వైద్యులు ఈ జ్వరమునుగూర్చి వ్రాసియున్నారు. విడిచివిడిచి వచ్చుటయు చలితోవచ్చుటయు, వీరు వర్ణించియున్నారు. కొన్నిజ్వరములు విషజ్వరములనియు, మరికొన్ని సామాన్యజ్వరములనియు నీవైద్యులు కనిపట్టిరి. కాని మొన్న మొన్నటివరకు ఐరోపాదేశీయులు, ఈజ్వరములు చెడు

పూర్వులుచలిజ్వరములకు చెడుగాలి కారణమనిరి.

వాయువులవలన వచ్చుచున్నవని నమ్మియుండిరి. ఏలయన ఈజ్వరము విరివిగ నీటుముంపుగల పల్లపు ప్రదేశముల యందును, తుక్కు, జమ్ము, మొదలగునవి గల ఆవలు, బందలు, కుంటలు గల ప్రదేశములయందును, ప్రబలి యుండుటచేత ఈ వ్యాధిని గలిగించు విషము బురద నేలలనుండి వెడలు వాయువులనుండియే వచ్చునని వారు తలచియుండిరి. ఈ వ్యాధియొక్క వ్యాపకమున కిట్టి బురదనేలలు కారణములు కాకపోయినను ఎట్లు సహాయకారులగునో ముందు చదువగలరు.

క్వాయినా పట్టను-చింకాను అనుఆమె కనిపట్టెను.

1640-సంవత్సరమునందు (Countess Chinchon) చింకా నను నామె, ఇప్పుడామెపేరు మీదుగా వాడబడు, సింకోనాబార్కు అను క్వాయినా పట్టను కనిపెట్టి ఈ జ్వరములకు మిక్కిలి ప్రసిద్ధిగా ఉపయోగించుచుండెను. 60 సంవత్సరముల పిమ్మట టూర్టి యను ఇటాలియా వైద్యుడు అక్కడి జ్వరములను క్వాయినావలన కుదురునవి అనియు క్వాయినావలన కుదురనివి అనియు రెండుతరగతులుగా విభజనచేసి చూపెను. 1880-వ సంవత్సరము వరకు వైద్యులనేకులు కొందరీజ్వరము సూక్ష్మజీవుల వలన బుట్టినదనియు, మరి కొందరు చెడుగాలివలన బుట్టినదనియు వాదించుకొను చుండిరి.

రక్తములో మలేరియా పురుగును లేవరన్ కని పట్టెను.

ఈ సంవత్సరమున లేవరన్ (Laweran) అను ఫ్రెంచివైద్యుడు ఈ వ్యాధిగలరోగుల నెత్తుటితో క్రింద 8-వ పటములో జూపబడినట్లు చంద్రవంకవలె ప్రత్యేక ఆకారముగల యొక పురుగును కనిపట్టెను. పిమ్మట ఈపురుగు కదులు చుండుటయు, కొన్ని మార్పులను చెందుటయు కూడ నితడు కనిపట్టెను. చలి జ్వరముల యొక్క ఉత్పత్తిని కనుగొనిన మహానుభావులలో నీతడే మొదటి



8-వ పటము

వాడు. ఈతనికీర్తి శాశ్వతముగ నుండును. ఇత డిది కనిపట్టినను చిరకాలమువరకు ప్రజలు దాని యుపయోగమును కనుగొన లేకపోయిరి. ఇటలీ దేశపు వైద్యసంఘమువారు తాము బురదనుండి తీసిన ఒకానొక విధమైన సూక్ష్మజీవియే ఈ చలి జ్వరమునకు కారణమని వాదించుటచే లేవరన్ యొక్క వాదము మూలబడెను.

దోమలకు మలేరియాకు సంబంధ మున్నదని మేన్సన్ కనిపట్టెను.

1894-వ సంవత్సరములో మేన్సన్ (Manson) అను నాతడు చలిజ్వరములు వచ్చు స్థలములును, దోమలుండు స్థలములును, ఒకటియేయని కనిపట్టి అందుచేత దోమలకును, చలి జ్వరములకును ఏదో ఒకవిధమైన సంబంధ ముండవలెనని ఊహాచేసెను. ఇదిగాక మానవుల నెత్తురును వెలుపలికి తీసినప్పుడే

గాని, నెత్తురు మానవుల దేహములో ప్రవహించు నప్పుడు చంద్రవంక వలెనుండు మలేరియా పురుగులు పెరుగుటగాని, మార్పులను పొందుటగాని లేదనికూడ మేన్సన్ కనిపట్టెను. ఇట్లు వెలుపలకు తీయబడిన రక్తమునందు మాత్రమే వృద్ధిపొందు స్వభావము మలేరియాపురుగుల కుండుట వలన దాని ప్రయోజన మేమో కనిపట్ట వలెనని అతడు ప్రయత్నించెను.

దోమకడుపులో మలేరియా పురుగులు పెరుగుట రాస్ కనిపట్టెను.

ఈతనిదారి ననుసరించి (Major Ross) మేజరు రాస్ అనునతడు 1895 సంవత్సరం మేనెల మొదలు చెన్నపట్టణములో ననేక సంవత్సరములు కృషిచేసెను. ఇతడు సాధారణముగ మన ఇండ్లలోనుండు క్యూలెక్సు (Culex) అను ఒకానొక విధమయిన దోమలను పట్టుకొని చలిజ్వరపు రోగులమీాద కరపించెను. అట్లు చలిజ్వరపు రోగుల నెత్తురును త్రాగిన దోమలను పెంచి ఆ దోమలను మొదటి దినమున ఒకదానిని రెండవదినమున మఱియొక దానిని మూడవ దినమున ఇంకొక దానిని ఇట్లు అనేక దినములు వరుసగా దినమున కొక్కొకదానిని కోసి వానిలోపలి అవయవములను పరీక్షించెను. ఇట్టి పరీక్షవలన మలేరియా పురుగు దోమ కడుపులో వెలుపలికంటె మిక్కిలి వృద్ధిగ పిల్లలను

పెట్టునని కనిపట్టెను. కాని మరియేమియును తెలి సికొనలేక పోయెను.

అంతట 1897 సంవత్సరం ఆగస్టు నెలలో నితడు ఈ క్యూలెక్సు దోమనువిడిచి అనాఫలీసు (Anopheles) దోమనుపట్టి పరీక్షచేయుటకు ప్రారంభించెను.

పక్షులలోని చలిజ్వరము వంటిజ్వరము.

1898-వ సంవత్సరములో ఇతడు కలకత్తాకు మార్పబడెను. ఇక్కడ అప్పుడు చలిజ్వరపురోగులు లేక పోవుటచేత ఈ చలిజ్వరమువంటి మరియొక జ్వరమును పక్షులలో కనిపట్టి ఆ పక్షులను పెంచి తన ప్రయోగములను వానిమీద చేయుచుండెను. ఈ పక్షుల జ్వరమును కలిగించు పురుగులును మలేరియాజ్వరమును కలిగించు పురుగులవలెనే దోమ కడుపులో పెరుగుటయు అవి దోమయొక్క పొట్ట గోడను చొరుచుకొని రక్తప్రవాహముగుండ ఉమ్మి తిత్తులలోనికి ప్రవేశించుటయు కనిపట్టెను. తరువాత నితడు కొన్ని దోమలను పెంచి వానిని చలిజ్వరముగల పిచికలమీద కఱపించి వాని ఉమ్మిలో కొన్ని దినముల తరువాత చలిజ్వరపు పురుగుల గ్రుడ్లను కనుగొనెను. ఈ దోమలను రోగములేని పిచికలమీద కఱపించి, 5 మొదలు 8 దినములలో

పరీక్షార్థమేర్పడిన 28 పిచికలలో 22 పిచికలకు ఈ
వ్యాధితప్పకవచ్చినట్టు కనిపట్టెను.

అటుపిమ్మట ఇటలీదేశపు వైద్యులందరును
మిక్కిలి శ్రమపడి పనిచేసి ఒక మనుష్యునినుండి
మరియొక మనుష్యునికి దోమమూలముననే చలి
జ్వరము వ్యాపించుచున్నదని కనిపట్టిరి. వారు
చలిజ్వరముగల రోగియొక్క నెత్తురును త్రాగిన
దోమలను ఏమియును రోగములేని మనుష్యుల
మీద కరిపించిరి. ఆ మనుష్యులకు కొన్ని దినము
లలో తప్పక చలిజ్వరము వచ్చుటయు, వారి నెత్తు
టిలో మలేరియాపురుగులు పెక్కువేలుగా వృద్ధి
నొందుటయు పిమ్మట కనిపట్టబడెను. ఈ విషయ
మునే ఇంగ్లాండు దేశములో (Manson) మేన్సన్
కూడ శోధించి స్థిరపరచెను. అది ఎట్లన చలిజ్వ
రపురోగిని కరచిన దోమలను ఇతర దేశముల
నుండి లండను పట్టణమునకు రవానాచేసి అక్కడ
రోగములేని ఇద్దరు మనుష్యులమీద నితడు కర
పించెను. ఈ యిద్దరికి కొన్ని దినములయిన పిమ్మ
ట చలిజ్వరమువచ్చి వారి నెత్తురులో మలేరియా
పురుగులు కనబడెను.

దోమమూలముననె చలిజ్వరపుపురుగు వ్యాపించుచున్నది.

మలేరియాజ్వరముయొక్క వ్యాపకమునకు ఇట్లు
తోడ్పడు మలేరియాపురుగును గూర్చియు దోమను
గూర్చియు,ముందు ప్రకరణములలో తెలియగలదు.

---

## మూడవ ప్రకరణము

### మలేరియా పురుగు

మలేరియా పురుగుమూల పదార్థపు సముదాయము.

చలిజ్వరముయొక్క కారణము చక్కగ తెలిసికొనవలెనన్న మలేరియా పురుగుయొక్క జీవితపు చరిత్రను మొదట తెలిసికొనవలెను. వేరొకమాట తెనుగు భాషలో లేనందున దీనికి పురుగు అనిపేరు పెట్టితిమేకాని దీనియొక్క నడవడికలు చదివిన పిమ్మట ఇది సామాన్యమైన పురుగుకాదని మీరు తెలిసికొనగలరు. ఇది జీవశాస్త్రములోని వికారిణి (Amoeba) వంటిది. విజ్ఞానచంద్రికాగ్రంథమాలలోని 3-వ గ్రంథమగు జీవశాస్త్రముయొక్క మొదటి ప్రకరణముచూడుడు. ఇదియు దానివలెనే జీవస్థానముగల మూలపదార్థపు సముదాయము. 9-వ పటము చూడుము. దీనికి నోరు లేకున్నను నిదినెత్తురు త్రాగి వృద్ధిపొంది పిల్లలను పెట్టును. వీనిని ఒకదానిపై నొకటిని దొంతరగాపెట్టిన ఒకఅంగుళము ఎత్తునకు 3000 మొదలు 24000 వేలవరకు పట్టును. దీనికి కాళ్లుచేతులు లేకున్నను నిది ఒకచోటనుండి మరియొకచోటికి ప్రాకగలదు.

ఇది నెత్తురుత్రాగి బ్రతుకునని చెప్పియుంటిమి. ఈపురుగు తన ఆహారమును సంపాదించుకొనుటకుగాని జీర్ణముచేసికొనుటకుగాని శ్రమపడదు. ఇతర జీవులచే తయారుచేయబడి సిద్ధముగానున్న ఆహారమునుతిని బ్రతుకును. ఇందుచే నిది జీవశాస్త్రములో పరాన్నభుక్కు లనియెడు (Parasites) జాతిలో చేరుచున్నది. దీనిని ఇద్దరు పోషింతురు. మొదటి పోషకుడు మానవుడు. మానవుల నెత్తురు దీని మొదటి నివాసస్థానము. మానవుల రక్తమును త్రాగిత్రాగి తుదకిది వారికే అపకారముచేయును. దీని పోషకులలో రెండవది ఆడదోమ. ఈయిద్దరు పోషకుల సాయమున నీపురుగు ఎంతెంత కాలము ఎప్పుడెప్పుడు జీవించునో తెలిసికొనవలెను.

మలేరియా పురుగు ఇది మన నెత్తుటిలో బ్రతుకును.

మలేరియా పురుగు మన నెత్తురులో నెట్లు నివసించునో తెలిసికొనుటకు మన నెత్తురును గురించి ముందుగా నెరుగవలెను. మన నెత్తుటిలో ఎఱ్ఱకణములు తెల్లకణములు అని రెండువిధములగు అణుమాత్రములైన జీవులు గలవు. ఇవి రసి అను ఒకానొకవిధమైన ద్రవపదార్థమునందు తేలుచుండును. నెత్తురుచుక్క నొకదానిని సూదిమొనతో నెత్తి యొకగాజు పలకమీాద పరచి తొగరుచెక్క మొద

మన నెత్తురులోని కణములు.

లగు కొన్నిరంగులు దానికి పట్టించి ఆరనిచ్చి 12 వందలరెట్లు వృద్ధిగ కనుపింపజేయు సూక్ష్మదర్శినితో పరీక్షింపగా 10-వ పటములో చూపబడిన ప్రకారము కనుపించును.

నెత్తురులోని తెల్ల.

అందు 1, 2, 3, 4, అను అంకెలుగలవి తెల్ల కణములు. వీనిలో మధ్యభాగమున దట్టమైన నలుపు రంగుగల భాగము జీవస్థానము. ఇది పలు విధములైన తెల్లకణములలో పలువిధములుగనుండును. ఈ జీవస్థానముచుట్టు నుండునది మూల పదార్థము. దీనికి తేలికైన ఎర్రరంగు పట్టియున్నది. ఈ తెల్లకణములు మనపేగులలో జీర్ణమైన ఆహారమును మనరక్తములోనికి జేర్చును. మన శత్రువులగు సూక్ష్మజీవులు మొదలగునవి మనరక్తములోనికి ప్రవేశించినప్పుడివి వానితో కలహమాడి వాని నశింపజేయుట కెల్లపుడు సిద్ధముగానుండును.

నెత్తురులోని ఎర్ర కణములు.

ఈ అంకెలుగల కణములుగాక మిగిలినవి ఎర్ర కణములు. ఈఎర్రకణములలో జీవస్థానములేదు. ఈ ఎర్రకణములే మన జీవనమునకు ముఖ్యాధారమైన ప్రాణవాయువును (Oxygen-అమ్లజనిని) మనఊపిరితిత్తులనుండి మననెత్తురులోనికి జేరవేయును.

నెత్తురులోని మలేరియా పురుగులు.

11-వ పటములో (మ) అనుచోటులందు గల యెర్రకణములలో మలేరియా పురుగులు పెరుగుచున్నవి. అందు కొన్ని చిన్నవి. కొన్ని క్రమముగా పెరిగి ఎర్రకణములనుతిని నశింపు చేయుచున్నవి. ఎడమప్రక్క నొకచోట మలేరియాపురుగుల గ్రుడ్లు ఒకగుంపుగానున్నవి. అవియును యెర్రకణములలో ప్రవేశించుటకు ప్రయత్నించు చున్నవి. రక్తము నందలి ఎర్ర కణములే మలేరియా పురుగుల కాహారము.

ద్విఖండ సంతానవృద్ధి విధానము.

ఈ యెర్ర కణములో ప్రవేశించిన మలేరియా పురుగు ఎట్లు పెరుగునో మనము తెలిసికొనవలెను. 1. 2-వ పటములలో చూడుము. అందు 1. సాధారణమైన యెర్రకణము 2. ఆయెర్రకణములో మలేరియాపురుగు ప్రవేశించినది. 3. ఈ యెర్ర కణములోని మలేరియా పురుగు పెద్దదయినది. 4. ఈయెర్రకణములో నీ పురుగుయొక్క జీవస్థానము రెండుగా విభజించబడినది. 5. ఈ యెర్రకణములో మలేరియా పురుగుయొక్క జీవస్థానము అనేక ముక్కలుగా విభాగమువెంది ఒక్కొకముక్కచుట్టు కొంత మూలపదార్థముచేరి ఒక్కొకముక్క యొక్కొక మలేరియాపురుగు పిల్లయగుచున్నది. 6. ఈయెర్ర

కణమును పగల్చుకొని అనేక మలేరియా పురుగు పిల్లలు వెలువడుచున్నవి. అవి తిరిగి 1. యను చోట చూపబడినట్లు యెర్రకణములలో ప్రవేశించబోవుచున్నవి. ఇది సాధారణముగా మలేరియాపురుగుయొక్క సంతానవృద్ధి (Reproduction)




12-వ పటము.

విధానము. మనరక్తములో ప్రవేశించిన మలేరియా పురుగు లనేకము లిట్లే యొక్కొకటి వందలు వందలుగా పెరుగును. ఈ మలేరియా పురుగులు మన రక్తములో లక్ష యెర్రకణముల కొక్కటి చొప్పున నున్నయెడల జ్వరము ప్రారంభ మగునని కొందరు కనిపట్టియున్నారు.

మన రక్తములో ప్రవేశించిన తరువాత ఈ ప్రకారము ఒక్కొక్క దినమునకు ఒక్కొక్క మలేరియా పురుగునుండి అనేక లక్షలు పిల్లలుపుట్టి పెరుగుచుండును. ఇట్లు దినదినమునకు కోట్లకొలది మలేరియా పురుగులు పెరిగి రక్తములోని యెర్ర కణములన్నిటిని తిని రోగిని కృశింపజేయును. ప్రక్కనున్న 13-వ పటము చూడుము. కొంత కాలమున కారోగిచచ్చినయెడల ఆరోగియందుండు మలేరియాపురుగు లన్నియు చావవలసినదే కదా ? సృష్టి వైచిత్ర్య మేమోగాని ఈ జాతిజీవు లిట్లు నశింపక తరతరమువరకు వృద్ధియగుటకై వేరొక విధమైన సంతానవృద్ధివిధానము ఏర్పడియున్నది.

ఒకదినమున కనేకలక్షలు పిల్లలు పుట్టును.

రెండవవిధమయిన సంతానవృద్ధికి సంయోగ సహిత సంతానవృద్ధి యని పేరు. ఈ రెండవ విధమయిన సంతానవృద్ధికి సాయపడుటకే దోమలు పోషకు లగుచున్నవి. మన రక్తములోని ఎర్రక ణములలోనుండు మలేరియా పురుగులు కొన్ని 22-వ పటమునందు 3,4,5,6 లలో చూపబడిన ప్రకారము యుక్తవయస్సునకు పెరిగిన తరువాత వాని జీవస్థానవిభాగమునొందక 7 లో చూపబడిన ప్రకారము అర్ధ చంద్రాకారము నొందును. దీని నుండి 8, 6 పటములలో చూపబడిన ప్రకారము

సంయోగ సహిత సంతానవృద్ధి.




13-వ పటము.

1. ఆడుపురుగు మగపురుగు అను భేదములేని చలిజ్వరపు పురుగు.

2, 3. మగపురుగుయొక్క వివిధావస్థలు.

3. నుండి పురుష బీజములుపుట్టి, అందులో నొకటి 5 లో నున్న ఆడుపురుగుతో సంయోగము చెందు [చున్నవి.

4, 5. ఆడుపురుగుల వివిధావస్థలు.

6. సంయోగము జెందినతరువాత నేర్పడురూపము. దానిగర్భమునిండ చలిజ్వరపు పురుగులుద్భవించుచున్నవి.

7. గర్భవతియగు తల్లిపురుగు కడుపుపగిలి దానినుండి వేనవేలు పిల్లపురుగులు బయలుపడుచున్నవి.

రెండువిధములగు మార్పులు కలుగును. 8 లో చూపబడినది మొగపురుగుగను 9 లో చూపబడినది ఆడుదిగను పరిణమించును.

మొగదానియొక్క జీవస్థానము 10 లో చూపబడిన ప్రకారము ముక్కలుముక్కలై 12 లో చూపబడిన ప్రకారము ఒక్కొక జీవస్థానముచుట్టు కొంత మూలపదార్థముచేరి తోకలుగానేర్పడును. ఈ తోకలు పరిపక్వమైనతరువాత ఊడిపోవును. ఈతోకలే పురుషబీజములు. అనగా ఒక్కొకటి ఒక్కొక ఆడు మలేరియా పురుగుతో చేరి 14 లో చూపబడిన ప్రకారము సంయోగమునొంది దానిని గర్భవతిగానే జేయును.

మొగ మలేరియా పురుగు.

9 లో చూపబడిన ఆడుమలేరియా పురుగు మగమలేరియా పురుగువలె విభాగమునొందక 11, 13 లలో చూపినప్రకారము గుండ్రనై పెద్దదియగును. 14 లో నొక ఆడుపురుగు పురుషబీజముతో సంయోగమునొంది గర్భవతి యగుచున్నది. ఇట్లు గర్భవతి అయినతోడనే దానిగుండ్రని ఆకారము మారి కోసుగానగును. పిమ్మట దానిజీవస్థానమనేకముక్కలుగా చీలి ఒక్కొక ముక్కచుట్టు కొంత మూలపదార్థమేర్పడి దానినుండి లెక్కలే

ఆడ మలేరియా పురుగు.

నన్ని గ్రుడ్లు ఏర్పడును. పిమ్మట ఆడు మలేరియా పురుగు పైనుండుపొర పగిలి దానినుండి అనేకములయిన గ్రుడ్లు వెలువడును. 16, 17, 18 ల చూడుము. ఇవియే పిల్లమలేరియా పురుగులై 1 లో చూపబడిన రక్తకణమున ప్రవేశించ బోవుచున్నవి.

ఒక్కదోమ కాటునకు వందలకొలది మలేరియా పురుగులు నెత్తురులో కలియును.

8 మొదలు 18 వరకు చూపబడిన మార్పులన్నియు మలేరియాపురుగులు దోమయొక్క కడుపులో నున్నప్పుడు జరుగుచున్నవి. ఈ మార్పులన్నియు పూర్తియగుటకు 6 మొదలు 10 దినములుపట్టును. దోమ కడుపులోనుండి బయలువెడలిన పిల్ల మలేరియాపురుగు లన్నియు దోమయొక్క ఉమ్మితిత్తిలోనికివచ్చి యచ్చట చేరియుండును. ఒక్కొక దోమకాటునకు వందలకొలది పిల్ల మలేరియా పురుగులు మన నెత్తురులో కలియును. దోమ ఎంతమందిని ఒకరాత్రియందు కుట్టునో అంతమందియొక్క రక్తము మలేరియా పురుగుల నదిప్రవేశపెట్టును.

మానవులును దోమయే మలేరియా పురుగుకు పోషకులు.

పయిన వ్రాసిన దానిని బట్టి మలేరియాపురుగు, మానవునిచే కొంతవరకు పోషింపబడియు దోమచే కొంతవరకు పోషింపబడియు జీవించు

నని తెలియుచున్నది. ఈ రెండును కాని చోట ఇదియొక క్షణమైనను బ్రతుకదు. ఒక మానవుని నుండి మరియొక మానవునకు మలేరియా అందుకొనవలెనన్న దోమయొక్క సాయములేనిదే కానేరదు.

మలేరియా పురుగులలోననేకభేదములు గలవు. వాని నీ చిన్నగ్రంథమునందు వర్ణించుటకు వీలు లేదు. అయినను వాని జాతిభేదములను గూర్చిన కొన్ని ముఖ్యాంశములను చలిజ్వరభేదములను ప్రకరణములో వివరించెదను.

మలేరియా పురుగుల జాతిభేదములు.

# నాలుగవ ప్రకరణము

## దోమ

వివిధజాతుల దోమలు.

సాధారణముగా నిండ్లలో మనముచూచు దోమలన్నియు వ్యాధులను జేరవేయునవికావు. ఈ విషయమున రెండుజాతుల దోమలుమాత్రము మనకు ముఖ్యమైనవి.

1. అనాఫలీసు దోమలు:—ఇవి మలేరియా జ్వరమును కలిగించు పురుగులు. ఒక మానవుని నుండి మరియొక మానవునికి జేరవేయునవి.

2. క్యూలెక్సు దోమలు:—ఇవి ఏనుగకాలు లేక మూదకాలు మొదలగు వ్యాధులను జేరవేయునవి.

3. స్టిగోమియా దోమలు:—ఈ రెండు జాతులనుగాక ఆకారమునందు కొంచెమించుమించుగా క్యూలెక్సు దోమవలెనే యుండి చెవులప్రక్కను జేరి గెమ్య్యుమని కూయుచు విసుకుజెందించెడుదోమ మరియొకటి కలదు. దీనికి స్టిగోమియా దోమయని పేరు. ఇది వ్యాధులను కలిగించుటలో సహకారి కాదు.

అనాఫలీసు క్యూలెక్సుదోమలను వేర్వేరుగ గుర్తించు విధము.

కొంచెముశ్రద్ధతో పరీక్షించువానికి అనాఫలీసు క్యూలెక్సు దోమలను తక్కిన దోమలనుండి విడదీయుటకుగాని, అనాఫలీసు దోమలను క్యూలెక్సు దోమలను వేర్వేరుగ గుర్తించుటకు గాని కష్టము కాదు. అట్లు గుర్తించుటకు తోడ్పడుటకు గాను వానినిగూర్చి కొన్ని అంశములను క్రింద వివరించుచున్నాను.

క్యూలెక్సుదోమ గోడమీాద వ్రాలియున్నప్పుడు గూనివానివలె కొంచెము వంగియుండును (14-వ పటము). అనాఫలీసుదోమ సిపాయివలె నిటారుగా శరీరమును నిగిడించి యుండును. (15-వ పటము) క్యూలెక్సుదోమ గోడమీాద పరుపుగా (సమాంతరముగా-Parallel) వ్రాలును. అనాఫలీసు దోమ ఏటవాలుగా వ్రాలును; అనగా దాని తల గోడకు సమీపముగను వెనుకభాగము గోడకు దూరముగను ఉండును.

అనాఫలీసు దోమలను, క్యూలెక్సుదోమలనుండి విడదీసిన తరువాత అనాఫలీసు దోమలలో ఆడవెవ్వియో మగవెవ్వియో కనిపట్టవలెను. ఈ యాడదోమలే మన నెత్తురుత్రాగి మనకపకారము చేయునవి.

క్రింది 16-వ పటములో 1 అనుచోట జూపినట్లు ఆడవాని మూతిమీాద రోమములంతగా నుండవు. మగవానికి కుచ్చువలె నుండు రోమము లుండును ; క్రిందిపటములో 2 అనుచోట చూడుము.

ఆడ అనాఫ లీసు దోమను గుర్తించు విధము.




16-వ పటము

దోమలు పెద్దవై యుక్తవయస్సు వచ్చిన తరువాతనే రెక్కలుగలిగి గాలిలో తిరుగును. ఇవి చిన్నతనములో చేపలవలె నీటిలో నివసించును. ఇవి గ్రుడ్లుగాపుట్టి, నీటిపురుగులుగా పెరిగి తుదకు రెక్కలుగల దోమలుగా పరిణమించును. ఈ రూప భేదములనుగూర్చి కొంతవర క్రింద వివరించెదము.

దోమయొక్క రూప భేదములు నాలుగు 1. గ్రుడ్డు 2.నీటిపురుగు 3. కామాపురుగు 4. రెక్కలుగల పురుగు.

దోమ లెప్పుడును తమ గ్రుడ్లను నీటిమీాదనే పెట్టును గాని ఇతరచోట్ల పెట్టవు. సాధారణ

దోమల గ్రుడ్లు.

ముగా అనాఫలీసుదోమలు నీటిపైని తేలుచుండు నేదేని యొక ఆకు, పుల్ల మొదలగు తుక్కుమీద కూర్చుండి నీటిలోనికి తమగ్రుడ్లను విడుచును. ఇవి నీటిమీద పడిన వెంటనే విడిపోయి నీటిపైని నల్లని నలకలవలె తేలుచుండును.

క్యూలెక్సుదోమలు, ఈక్రింది 17-వ పటములో చూపబడినట్లు తమగ్రుడ్లను దోప్పవలెనుండు నొక



17-వ పటము

ముద్దగాపెట్టును. ఈదోప్పలో ననేక వందల గ్రుడ్లు ఒకదానిప్రక్క నొకటి యంటుకొని యుండును. ఇట్లు తేలునప్పు డీదోప్ప చూచుటకు కిరసనాయిల్ మసియుండ నీటిలో తేలుచున్నట్లుండును.

దోమలు-నీటి పురుగులు.

రెండుమూడు దినములలో ఈగ్రుడ్లుపెరిగి చిన్న చిన్న పురుగులవలెనయి నీటియం దతివేగమున నీదుచు ఆతురతతో మురికిని తినుచు మునుగుచు తేలుచు మెలికలు తిరుగుచు పరుగులెత్తుచుండును.

18-వ పటములో 1 అనుచోట చూపబడినది అనాఫలీసు దోమపిల్ల. ఇది నీటియొక్క పైభాగము నుండి కొంచెములోతున పరుపుగా పరుండి వెనుక ప్రక్క కీదుచుండును. ఈ దోమపిల్లల వీపుమీద




18-వ పటము

చిన్న చిన్న దొప్పలవలె నుండు అవయవములు గలవు. (1 టిలో పైతట్టున చూడుము). ఈదొప్పలు నీటిపై నుండు గాలివైపునకు తెరచి యుండుటచే వీనిగుండ నీదోమపిల్లలు తమకు కావలసిన గాలిని నీటి యుపరితలముననుండి పీల్చుకొనుచుండును.

క్యూలెక్సుదోమపిల్లలు 18-వ పటములో 2అను చోట చూపబడినప్రకారము నిలువున తలక్రిందుగా నీదుచుండును. ఇది క్షణక్షణమునకు నీటి పైభాగ

మునకు తేలుచు తమతోకలో నుండు నొకచిన్న గొట్టముగుండ గాలిని పీల్చుకొని తిరిగి మునుగు చుండును.

నీటి యుపరితలముననుండు గాలిని దోమపిల్లలు పీల్చుకొనలేక పోయినచో నవియెల్లను తక్షణమే చచ్చిపోవును.

దోమగూడు. ఇట్లు 6 లేక 7 దినములయినతరువాత నీ దోమ పిల్లలు కొక్కెమువలె ముడుచుకొని, రెండుమూడు దినములవరకు చురుకు తగ్గియుండును. ఇపు డీ పురుగుపై నొకగూటివలె నేర్పడి ఆ గుల్లలోపల నత్తవలె దోమపిల్ల రూపనిష్పత్తి జెందుచుండును. వీనితల పెద్దదిగను నల్లగను ఉండును. వీని తల యందు బూరాలవలెనుండు గొట్టములు రెండు గలవు. ఇవి ఈ గొట్టములద్వారా గాలిని పీల్చు కొనును. ఈ స్థితియందు అనాఫలీసు దోమలను, క్యూలెక్సు దోమలనుండి గుర్తించుట కష్టము. రెండు దినము లిట్లుండ వీనికి రెక్కలుపెరిగి తమపై నుండు గూటి నకస్మాత్తుగా పగల్చుకొని బయటపడి గాలిలో నెగిరిపోవును.

రెక్కలుగల దోమలు. ఇట్లెగిరి పోయిన తరువాత నీ దోమ రెండు మూడుదినములలో గ్రుడ్లను పెట్టును. ఒకతరము

దోమనుండి మరియొకతరము దోమ పుట్టుటకు సాధారణముగా 10 లేక 12 దినములకంటె ఎక్కువ కాలము పట్టదు. అనగా ఒక్క తల్లిదోమనుండి పదలు వేలకొలది పిల్లలు రెండువారములలో తయారగును.

దోమలకు కండ్లు రెండును గలవుగాని యవి దూరపు వస్తువులను చూడలేవు. వాసనయును రుచి యును మనకంటె మిక్కిలి సూక్ష్మముగ కనిపట్ట గలవు. దోమలు సాధారణముగా రాత్రులయందు మాత్రము సంచరించు జంతువులు. పగటి సమయ మున చల్లని నిశ్శబ్దమైనస్థలములలో నిద్రించును. ఇవి సూర్యాస్తమయము కాగానే మేయుటకును గ్రుడ్లు పెట్టుటకును బయలువెడలును. కాని మబ్బు దినములయందును, ఎండ చొరని అడవులలోను, చీకటి గదులలోను, ఇవి ఎల్లప్పుడును తిరుగుచుం డును. స్టిగోమియా దోమ పగలు రాత్రి యనక సర్వదా మేత మేయుచుండును. వీని కింగ్లీషులో పులిదోమలు (Tiger mosquitoes) అని పేరు.

దోమపిల్లలను పరీక్షించు విధము.

ఇదివరకెన్నడును దోమపిల్లలనుచూడనివారలు తమ దొడ్డిలోకిపోయి ఎక్కడనైనను 10 లేక 15 దినములనాటి నిలువనీళ్లున్నయెడల కనిపట్టవలెను.

ఇందుకొరకు పారవేయబడిన ఓటికుండలలోను,కిర్సి నాయిలు డబ్బాలలోను, ఉపయోగములో లేని కుడితిగోలెములోను, నీటి తొట్లలోను, గోతుల లోను, వెదకవలెను. వానిలో నిలవ నీళ్లుండిన యెడల ఆనీళ్లలో నతివేగముగ పరుగులాడుచున్న చిన్నచిన్న జంతువులు కనబడును. అవి అంగుళ ములో 16-వ వంతు మొదలు 4-వ వంతు వర కుండును. వీనినిపట్టి స్వచ్ఛమైన తెల్లని గాజుసీసా లోని నీళ్లలోవేసి పరీక్షించిన నవి నీటి యుపరితల మునకు వచ్చి తోకలోని గొట్టముతో గాలినిపీల్చు కొనుటయు వెంటనే మునుగుటయు చూడగలరు.

దోమపిల్లలను పట్టుసాధనము.

ఇట్లు దోమపిల్లలను పట్టి వానిజాతులను తెలసి కొనుట కొక సులభమైన సాధనము గలదు. 1½ అడుగు పొడుగుగల ఒక ఇనుప తీగెను తీసికొని దానిని కడియమువలె వంచికట్టవలెను. ఈకడియ ముపై నొక తెల్లని పలుచని మల్లుబట్టను వలవలె పరచి కుట్టవలెను. ఈకడియమును మూడుగొలుసు లతో తక్కెడ పళ్లెమువలె వ్రేలాడ దీయవలెను. ఈగొలుసుల మూటియొక్క కొనలను ఒక చిన్న ఇనుప ఉంగరమునందు తగిలించి, ఆ ఉంగరమున కొకచేదత్రాడునుకట్టవలెను. ఒకనూతిలో దోమపిల్ల లున్నవో లేవో తెలిసికొనుటకు ఈవలను మెల్లగ

నా నూతిలోనికి విడిచి, కొంచెము దూరమువరకు నీటిలో దీనిని ఈడ్చి, పిమ్మట పైకిలాగవలెను. అంతట నీరంతయు గుడ్డలోనుండి క్రిందికిపోయి దోమ పిల్లలు మాత్రమందులో చిక్కుకొనును. వీని నొక సీసాలో వేసి పెంచి వాని జాతిభేదములను గుణములను తెలిసికొన నగును.

1. దోమలు అమితముగనున్న చోట్ల ఎక్కడే విధమైన నిలువ నీరున్నను ఆనీటిలోనెల్ల దోమపిల్లలు కనబడినను అనాఫలీసు దోమలు సాధారణముగా సమయమునకు ఏనీరుకనబడిన ఆనీటిలో తన పిల్లలనుపెట్టక యేస్థలమునందు పిల్లలను పెట్టిన మిక్కిలి అనుకూలమో అనువిషయము బాగుగ నాలోచించుననియు, ఒక్కొక్క ఉపజాతి అనాఫలీసు దోమలు ఒక్కొక్కమాదిరి స్థలములను తమపిల్లలను పెట్టుటకు ఏర్పాటు చేసికొనుననియు తోచుచున్నది. ఇందు ముఖ్యముగ మూడుఉపజాతులను మనముగమనించవలసి యున్నది. అందొక ఉపజాతి అనాఫలీసు దోమలు ఊరికి దూరముగనుండి నాచు మొదలగు ఆకలమును పెరుగుచుండు నీటియందు మాత్రము తనపిల్లలను పెట్టును. ఈ జాతిదోమలు సాధారణముగా ఇండ్లలోనికిరావు.

అనాఫలీసు దోమలయుపజాతులు; వాని నివాసస్థానములు.

2. మఱియొక ఉపజాతి అనాఫలీసు దోమలు ప్రవాహముగల నీటిలో తమపిల్లలను పెట్టును. ఇట్టి వానికి సాధారణముగా పొలములలోని పంట కాలువ లాధారములు.

3. మరియొక ఉపజాతి అనాఫలీసు దోమలు ఇండ్ల సమీపములనుండు లోతులేని బురదగుంట లలో తమపిల్లలను పెట్టును. సాధారణముగా ఈ జాతిదోమలు మన దేశములో మిక్కిలి యధికముగ ప్రబలియున్నవి. వర్షకాలము రాగానే యూరి బయట గోతులలో జేరు నిలవ నీటిలో నీ దోమపిల్ల లమితముగ నుండును. ఇండ్లలో తరుచుగ జొర బడు అనాఫలీసు దోమలు ఈజాతిలోనివే. అనాఫలీసు దోమలయందలి యుపజాతుల నివాసస్థానములు, వాని ఆహారపదార్థములు, వానినడవడికలు మొదలగువిషయము లింక ననేకములు నిశ్చయముగా మనకు తెలియవు. అయినను అనాఫలీసు దోమలనుగూర్చి ఈ క్రింది విషయములను చక్కగ గమనించుట మంచిది.

అనాఫలీసు దోమల నడవడికల సంగ్రహము.

i. అనాఫలీసు దోమలు ముఖ్యముగ రాత్రులయందే సంచరించును. పగటియందివిచీకటి గదులలోగాని, చీకటి గల తలుపు మూలలలోగాని,

వ్రేలాడవేసిన బట్టల చాటునగాని, దాగికొని యుండును.

ii. ఆడ అనాఫలీసు దోమలు నెత్తురు మాత్రము త్రాగి బ్రతుకును.

iii. అనాఫలీసు దోమ లధికముగ వృద్ధి జెందు కాలము ఆయా దేశములయందలి వర్ష ఋతువును బట్టియు ఆయా యుపజాతియొక్క నివాసస్థానము లను బట్టియు మారుచుండును.

iv. అనాఫలీసు దోమలు చాల దూరము పరు గెత్తవు.

v. కొన్నిచోట్ల అనాఫలీసు దోమలు చలికా లము రాగానే ఎక్కడ వేడిగ నుండునో ఆ దేశము నకు పోయి తిరిగి తగినకాలము వచ్చినప్పుడు తమ నివాసస్థానమునకు వచ్చును. దోమలు చలికాలము రాగానే యొక్కటియు కనబడక పోవుటకును, తిరిగి వేసవికాలములో వేనవేలు ఉత్పత్తియగుట కును కారణము లూహింపనగును.

vi. కొన్ని దోమలు వానివృద్ధికితగని స్థితిగతులు వచ్చినప్పుడు, తాము దాగియుండుటకు తగియుండు నేల కొట్లు మొదలగు చీకటి గదులలోనికిపోయి

అక్కడ ననేక మాసముల వరకు ఆహారముకూడ నక్కర లేకుండ నిద్రను జెందును. తమ వృద్ధికి తగిన సమయము వచ్చినప్పుడే దోమలు తమ నిద్ర నుండిలేచి బయటికివచ్చి పిల్లలనుపెట్టి తమజాతిని ఒకసంవత్సరమునుండి మరియొక సంవత్సరమునకు వ్యాపింపజేయును. కొన్ని దోమపిల్లలుకూడ వాని పెంపునకు తగినకాలము సమకూరని యెడల ననేక మాసములవరకు నిట్టి నిద్రావస్థనుజెంది తగిన తరుణము వచ్చినప్పుడే పెద్దదోమలుగా పరిణమించును.

క్యూలెక్సు దోమపిల్లల నివాస స్థానములు.

క్యూలెక్సుదోమ పిల్లలు మురికినీటిలో మిక్కిలి వేగముగ వృద్ధిజెందును. ఉపయోగములో లేని పాడునూతులును, రోడ్ల ప్రక్కలనుండు గోతులును, మురుగుకాలువలును, దీనిపిల్లలకు ప్రియమైన నివాసస్థానములు. మానవుల అశుద్ధసంబంధమైన కల్మషముగల నీటిలో నీజాతిదోమపిల్లలు మిక్కిలి వృద్ధి పొందును. ఓటికుండలు, పగిలిపోయిన సీసాలు, పీపాలు, మొదలగు వానిలోని నిలుకడ నీటియందును ఈజాతిదోమ పిల్లలను పెట్టును.

స్టిగోమియా దోమపిల్లల నివాస స్థానము.

స్టిగోమియా దోమపిల్లలు ఇంటిచుట్టు నుండు నిలువ నీటితొట్లలో సామాన్యముగా సంవత్సరము పొడుగునను ఉండును. నల్లులెక్కకుండ మంచము

గోళ్ళ క్రింద పెట్టుకొను నీటిపళ్లెములలోను, చీమలు రాకుండ బెల్లము, నెయ్యి మొదలగు పదార్థముల నుంచుకొను పళ్లెములలోను పోయునీటిని 10లేక15 దినములవరకు మార్చకుండ పెట్టిపెట్టినయెడల నట్టి నీటియందును, తరుచుగ నీదోమపిల్లలు కనబడును. ఇవి నూతులలోను, పగిలిపోయిన బుడ్లలోని నీళ్ళ లోను, కుండపెంకులలోను, చెట్లతొర్రలలోని నిలవ నీళ్లలోనుకూడ కనబడును.

దోమలయొక్క నైసర్గిక విరోధులు.

పెద్దపెరిగిన తరువాత దోమలను అనేకములగు పక్షులు, చేపలు, పురుగులు, గబ్బిలములు, మొదలగు జంతువులు తిని నశింపుజేయును. సరిగాదొరకి నప్పుడు చీమలుకూడ దోమలను పట్టితినును. పెద్ద దోమలకంటె ననేకరెట్లు వీనిపిల్లలు సృష్టిలో నాశనము జెందుచున్నవి. కొన్నిజాతుల దోమపిల్లలే మరికొన్నిజాతులదోమపిల్లలనుతినివేయును. కొన్ని నీటిపురుగులు ఈదోమపిల్లలను దొరకి నప్పుడెల్లను విడువక మ్రింగివేయును. పరిగెలు మొదలగు కొన్ని చేపలు మిక్కిలి చమత్కారముగ నీదోమపిల్లలకై కాచియుండి వానినిపట్టి నశింపుజేయును. ఈచేపలు సామాన్యముగా అన్నిచోట్లనుదొరకును. తగినన్ని చేపలుండి, దోమపిల్లలు దాగుకొనుట కనుకూల

పడు తుక్కులేనప్పుడే నీటియందైనను దోమపిల్లలు వృద్ధిపొందకుండ చేయవచ్చును. అయినను, మురిగి పోయిన నీటిలో వానికి చాలినంత ప్రాణవాయువు లేకపోవుటచేత చేపలుబ్రతుకజాలవను విషయమును గమనింపవలెను.

గాలికూడ నీటి యుపరితలమునకు చొరకుండు నట్లు నీటిమీద నాచుమిక్కిలి దట్టముగ అల్లుకొని యున్నయెడల అట్టినీటిలో దోమపిల్లలు పెరుగ నేరవు. ఒకటి రెండుదినములు పెరిగినను తరువాత గాలిలేక యవి యుక్కిరి బిక్కిరి అయిచచ్చును.

దోమలనశిం పుజేయుఇతర సాధనములు.

ఉప్పు,సున్నము, మైలతుత్తము,అన్నభేదిమొద లగు పదార్థములను నీళ్ళలో కలిపి నప్పుడా నీరు దోమపిల్లలను నాశనముచేయును. కాని అవిసామా న్యముగా నన్నిచోట్ల నుపయోగించుటకు చాల హెచ్చుగ వెలయగును. అందుచేత నవి యంతగా ఉపయోగకరములు కావు. కిరసనాయిలును నీటి మీద వేసినతోడనే యది మిక్కిలి పలుచనిపొరగా నీటిమీద ప్రాకిపోవును. ఇట్లు నీటియుపరితలము నంతను ఆక్రమించిన ఈకిరసనాయిల్ పొరగుండ గాలిచొరదు. అందుచే నీటిలోని దోమపిల్లలన్నియు పీల్చుటకు గాలిలేక చచ్చిపోవును. అయినను గాలి

వేగముగవీచుచున్న యెడల కిరసనాయిలుఅంతయు ఒకవైపునకు కొట్టుకొని పోవుటచే దోమపిల్లలు తప్పించుకొని పోవచ్చును. కిరసనాయిలులో కార్బాలికు ఆసిడ్ మొదలగు కొన్నిమందులు చేర్చిన యెడల ఈ దోమపిల్లలు ఇంకను సులభముగ చచ్చును.

# ఐదవ ప్రకరణము

## చలిజ్వర భేదములు

చలిజ్వర భేదములు నాలుగు.

చలిజ్వరములందు ముఖ్యమైన భేదములు నాలుగు కలవు.

ద్వితీయక జ్వరములు.

1. రెండవపటములో చూపబడిన ప్రకారము 24 గంటల కొకసారి యనగా దిన దినము వచ్చునదియొక జాతి జ్వరము. దీనికి ద్వితీయక జ్వరమని పేరు.

సామాన్య తృతీయక జ్వరములు.

2. మూడవ పటములో చూపబడిన ప్రకారము 48 గంటల కొకసారి యనగా జ్వరము వచ్చిన దినము మొదలు మూడవనాడు వచ్చునవి కొన్ని జ్వరములుగలవు. వీనికి తృతీయక జ్వరములని పేరు. ఈతృతీయక జ్వరములలో కొన్ని చికిత్సకు లొంగును. వీనికి సామాన్య తృతీయక జ్వరములని పేరు.

విషతృతీయక జ్వరములు.

3. తృతీయక జ్వరములలో మరికొన్ని చికిత్సకు సాధారణముగా లొంగవు. వీనికి విషతృతీయక జ్వరములని పేరు.

4. మరికొన్ని జ్వరములు నాలవ పటములో చూపిన ప్రకారము 72 గంటల కొకసారి అనగా జ్వరము కలిగిన దినము మొదలు నాలుగవ నాడు మరల వ్యాపించును. వీనికి చతుర్థక జ్వరము లని పేరు.

చతుర్థకజ్వరములు.

పైని ఉదాహరించిన నాలుగు జాతుల మలేరియా జ్వరములకును నాలుగు జాతుల మలేరియా పురుగులు గలవు. ఒక జాతి పురుగువలన ఆజాతి జ్వరమే వచ్చునుగాని వేరొక జాతిజ్వరము రాదు. ద్వితీయకజ్వరపు పురుగులవలన దినదినము వచ్చెడి జ్వరము వచ్చునుగాని దినమువిడిచి దినమువచ్చు జ్వరమురాదు. ఇట్లే సామాన్య మలేరియా జ్వరపు పురుగు వలన విష మలేరియాజ్వరము రాదు. విష జ్వరపు పురుగులవలన సామాన్య జ్వరము రాదు.

మలేరియా పురుగుల జాతులు నాలుగు.

అయినను ద్వితీయక జ్వరమును గలిగించు పురుగులు కొన్ని యొక నాడేదోయొక సమయము నందును, మరికొన్ని ఆదినముననే మరియొక సమయమునందును రోగియొక్క రక్తములో ప్రవేశించినయెడల మొదట ప్రవేశించిన జ్వరపు పురుగులవలన గలిగిన జ్వరము, దినమునకు ఒకసారివచ్చును. ఈపురుగులవలన కలిగిన జ్వరమువచ్చిదిగిపో

ఒకదినముననే రెండుసార్లు జ్వరమువచ్చుట.

యినతరువాత ఆదినముననే మరికొంతసేపటికి రెండవసారి రక్తములో ప్రవేశించిన జ్వరపు పురుగుల సంబంధమైన జ్వరము దాని సమయమునకు లెక్క ప్రకారము 24 గంటలకు రావచ్చును. అట్టిరోగులకు ఒకదినమున రెండుసార్లు జ్వరమువచ్చును.

తృతీయక జ్వరపు పురుగులవలన దినదినము జ్వరము వచ్చుట.

లేదా 48 గంటల కొకసారి వృద్ధిబొందు జాతిలోని జ్వరపు పురుగులు కొన్నియొకనాడును, మరి కొన్నిమరుసటిదినమునను రోగియొక్క రక్తములో ప్రవేశించినయెడల, మొదటిదినమున ప్రవేశించిన పురుగుల సంబంధమైనజ్వరముఒకనాడును, రెండవ దినమునప్రవేశించిన పురుగులసంబంధమైనజ్వరము ఆదినమునకు మరుసటిదినమునను వచ్చును. అందుచేత 48 గంటల కొకసారి జ్వరమును కలుగజేయు పురుగు రక్తములో నున్నప్పుడు కూడ నొకానొకప్పుడు, జ్వరము 24 గంటల కొకసారి రావచ్చును. 5-వ పటములో చూపబడినది ఈజాతి జ్వరమే. మందు ఇచ్చుటవలన ఒకజట్టుపురుగులు చచ్చినవి. అందుచేతనే 5, 7 తేదీలను జ్వరము రాలేదు. ఆ మందు రెండవజట్టు పురుగులనేమియు చేయలేదు. కాబట్టి ఆజట్టుపురుగులవలన గలిగిన జ్వరము దాని నియమితకాలమునకు అనగా దినమువిడిచి దినము వచ్చుచున్నది.

ఇట్లే రెండుజాతుల మలేరియాపురుగులు ఒకటే దినమున రక్తములో ప్రవేశించి రెండుజాతుల జ్వరములను ఒకటే సమయమున గలుగజేయవచ్చును. లేదా చలిజ్వరపు పురుగులును ఇతర జ్వరములను కలుగజేయు సూక్ష్మజీవులును ఒకటే సమయమున రక్తములో ప్రవేశించినయెడల ఆ రెండుజ్వరములును ద్వంద్వముగా ఒకటేసారి రోగినిబాధింపవచ్చును. ఇట్టిజ్వరముల స్వరూపములను కనిపెట్టుట సామాన్య వైద్యులకు కష్టసాధ్యము.

రెండుమూడు జాతుల జ్వరములు ఏకకాలములో వచ్చుట.

రోగియొక్క రక్తమును సూక్ష్మదర్శినితో పరీక్షించి మలేరియా పురుగులను వేర్వేరుగ పోల్పదగినవారికిమాత్ర మట్టిజ్వరభేదములు సులభముగ తెలియును. ఇట్లు పోల్చుటకు వేర్వేరు జాతుల మలేరియా పురుగుల ఆకారములను వాని నడవడులను తెలిసికొనుట యవసరము. అవియన్నియు నీచిన్న పుస్తకమునందు వ్రాయుటకు వీలులేదు. సామాన్య తృతీయక జ్వరపుపురుగుల యొక్కయు, విషతృతీయక జ్వరపుపురుగుల యొక్కయు, వివిధ దశలయందలిఆకారములను క్రింది 19-వ పటములో కొంతవరకు చూపియున్నాము. సంయోగసహిత సంతానవృద్ధి కేర్పడినరూపములు (8. చూడుము)

సామాన్యజ్వరపుపురుగుల యొక్కయు విష జ్వరపు పురుగులయొక్కయు ఆకార భేదములు.




సామాన్య తృతీయక జ్వరపుపురుగుల వివిధదశలు.




విషతృతీయక జ్వరపుపురుగుల వివిధదశలు.

19-వ పటము.

సామాన్య జ్వరములలో గుండ్రముగ నుండుటయు, విషజ్వరములలో అర్ధచంద్రాకారముగ నుండుటయు గుర్తింపనగును.

విషమలేరియా జ్వరపుపురుగులవలన దినదినము వచ్చుచుండినజ్వరముయొక్క స్వరూపమును తెలుపు పటము 15-వ పుటలోనున్నది చూడుడు. ఆరోగికి దఫాదఫాలుగా రెండుమాసములవరకు క్రమము

లేకుండ జ్వరము వచ్చుచుండెను. ఆరోగియొక్క రక్తమునందు విషమలేరియా పురుగు లప్పుడప్పుడు కనబడుచుండెను. ఇట్టి జ్వరములను మొదటి నుండియు కనిపట్టి వైద్యుడు చికిత్సచేసిన గాని కుదురుట కష్టము.

# ఆరవ ప్రకరణము

## చలిజ్వర లక్షణములు

చలిజ్వర లక్షణము లనేకము లన్ని జాతుల జ్వరములకు సామాన్యములు.

చలిజ్వరపు పురుగులలో నాలుగు ముఖ్య భేదములుగలవని 5-వ ప్రకరణములో చెప్పియున్నాము. వాని వలన గలుగు జ్వరలక్షణము లనేకములు. అన్ని చలిజ్వరములకు సామాన్యముగనే యున్నవి. కొన్ని లక్షణములు మాత్రము విషజాతి జ్వరములకు ప్రత్యేకముగ నున్నవి. కావున సామాన్య జ్వరములకు గల లక్షణములను ముందుగా వివరించి విషజ్వరములకు ప్రత్యేకముగనుండు లక్షణములను కొన్నిటిని తరువాత పేర్కొనుచున్నాము.

చలిజ్వరలక్షణములను శోధింపగా నా లక్షణములలో (1) జ్వరమునకు సూచనలు. (2) నిజమైన జ్వరము. (3) విరామకాలము అను మూడువిభాగములు కనబడుచున్నవి.

జ్వరమునకు సూచనలు.

జ్వరము రాకపూర్వము కొన్నిదినములు ఏదో బద్ధకముగా నున్న దనిగాని, పనితోచుట లేదని గాని, విచారకరముగా నున్నదనిగానిరోగిచెప్పును.

కాళ్లుచేతులు నడుమ లాగికొని పోవుట, గ్రుడ్లు పీకుట, ఎడమ డొక్కలో నొప్పిగా నుండుట, అన్న హితవు తగ్గిపోవుట, విరేచన బద్ధకము, మొదలగు నవి ఉండవచ్చును. కొంచెము చలి చలిగా గాని, కొంచెముజ్వరమువచ్చినట్లుగాగాని,యొకదినములో ఏదో ఒక సమయమందు తోచవచ్చును. ఒకొక్కప్పుడు ఈ చిహ్నములు దినము విడిచి దినమున ఉండవచ్చును. మలేరియా పురుగుయొక్క అంటు సోకిన రెండువారములలోగా ఈ జ్వరమెప్పుడు వచ్చినను రావచ్చును. ఈ జ్వరముయొక్క రాక, రక్తములో ప్రవేశించిన మలేరియా పురుగుల సంఖ్యను బట్టియు వాని శక్తిని బట్టియు, రోగియొక్క బలమును బట్టియు, మారుచుండును. ఈ సూచన లేవియు లేకయే నిజమైన జ్వరము అకస్మాత్తుగా రావచ్చును.

2. నిజమైన చలిజ్వరలక్షణములలో మూడు దశలుగలవు.

నిజమైనజ్వర లక్షణములు శీతలదశ.

౧. శీతలదశ : ఇందు అదివరకున్న సూచనలు హెచ్చగును. రోగి పనిచేయలేక పోవును. తరుచు ఆవలించుచుండును. ఒడలు విరచుకొనును. తల నొప్పి హెచ్చగును. వెన్ను వెంబడిని, కాళ్లచేతుల

వెంబడిని చలియు, కుదుపును పుట్టును. ముఖము వాడిపోయి నల్లబడును. పిమ్మట అధికమైన వణకు ప్రారంభించును. పండ్లుకరచుకొనిపోవును. శ్వాస చలితోడ కూడినదై ఎగుడు దిగుడుగా వచ్చును. మాట సగమువచ్చును. నాడి నీరసించి వేగ మధిక మగును. ఇంటిలోనున్న దుప్పట్లు అన్నియు కప్పుకొనును. పాపము చలిమాత్రము తీరదు. ఒక్కొకప్పుడు వాంతులును విరేచనములును ఉండవచ్చును. కాళ్లుచేతులు అమితముగ లాగికొనిపోవును. చెవులలో ధ్వని బైలుదేరవచ్చును. దినమువిడిచి దినమువచ్చు సామాన్యజ్వరములో చలి కుదుపు తక్కిన జ్వరములకంటె హెచ్చుగానుండును. అరగంట మొదలు గంటవరకుగాని అంతకంటె హెచ్చుగగాని చలియుండవచ్చును. పిల్లలకు, కుదుపు కనపడక పోవచ్చును. దీనికి బదులుగా బాలపాపచిహ్నము లనబడు ఈడ్పుగాని వాంతులుగాని రావచ్చును. చలిరాకముందే జ్వరము కొంచెము ప్రారంభించి కుదుపుతోపాటు 104 మొదలు 106 డిగ్రీల వరకు హెచ్చును. పిమ్మట ఈ చలి భగభగ మను మంటలుగా మారును.

ఉష్ణదశ. 2. ఉష్ణదశ: ఉష్ణదశలో మంటలు మొదట అప్పుడప్పుడువచ్చి తుదకు శరీరమంతయు ఒకటే

వేడిగా మారును. ముఖముకందును. కండ్లు ఎఱ్ఱ నగును. నోరు ఎండిపోవును. నాలుక గిడసబారును. శరీరము వేడిగాను పొడిగాను ఉండును. రోగి విసుగుకొనుచు పొర్లుచుండును. దాహము హెచ్చును. కప్పినదుప్పట్లను ప్రక్కదుప్పట్లను తీసివేయుదమనును. బలమయిన జ్వరములో మతి భ్రమించును. పిచ్చిమాటలాడును. ఒక్కొకప్పుడు స్పృహ తెలియకపోవును. ఆకుపచ్చని పసరు వాంతి అగును. విరేచనములుకూడ ఉండవచ్చును. నాడిస్ఫుటముగ నుండును. పరుగెత్తుచుండును. కడుపులోని జ్వరగడ్డ పెద్దది అగును. ఎడమడొక్కలో నొక్కిన కొంచెము నొప్పి ఎత్తును. ఇప్పుడు జ్వరము 107 వరకు హెచ్చిన హెచ్చవచ్చును. ఈ ఉష్ణదశ 4 లేక 5 గంటలుండును.

స్వేదదశ: పిమ్మట చెమట ప్రారంభించును. స్వేదదశ సామాన్యముగా తలమీద ప్రారంభించి వేగమె ఒడలంతయు ప్రాకి మిక్కిలి అధికమై ప్రక్కబట్టలను తడిపివేయును. పిమ్మట త్వరలో జ్వరము తగ్గి జ్వరలక్షణములన్నియు పోవును. నాడి మృదువై మందమై నోరుచెమ్మగిలి జ్వరమురాక పూర్వము ఉన్నప్పటికంటె సుఖముగా నున్నదనిరోగిచెప్పును.

సామాన్యముగా వెంటనే రోగి నిద్రపోవును. పిల్లలకు సామాన్యముగా చెమట పట్టక పోవచ్చును.

విరామ కాలము.

3. విరామకాలము: జ్వరము దిగిపోయినతోడనే రోగి తన పనులు చేయుటకు దార్ఢ్యము కలిగి యుండును. మొదటిసారి జ్వరము వచ్చినప్పటినుండి లెక్కచూచుకొనగా 24 లేక 48 లేక 72 గంటలకు తిరిగి మొదటిరోజున నుండినలక్షణములతో అనగా చలికుదుపు జ్వరము చెమ్మట వీనితోడ తిరిగివచ్చును. సామాన్యముగా మందు పుచ్చుకొననియెడల కొంతకాలమునకు నీరసమధికమై రోగి మృతినొందును. లేదా రెండుమూడు సంవత్సరములవరకు అప్పుడప్పుడు జ్వరమువచ్చుచుండును. రోగిని బలహీనునిగ జేయుచు కొంతకాలమునకు వానిని ఇతర రోగముల పాలుచేయవచ్చును. ఒకసారివచ్చిన చలిజ్వరము నిశ్శేషముగ కుదరని యెడల నొకానొకప్పుడు 5 లేక 6 సంవత్సరముల తరువాతకూడ బయటబడి తిరిగి రోగిని బాధింపవచ్చును. మిక్కిలి బలవంతులగు కొంతమందికి జ్వరము క్రమక్రమముగ దానంతట దది తగ్గిపోవచ్చును.

విషజ్వర లక్షణములు.

విషజ్వరములలో కూడ పైనిచెప్పిన లక్షణములే యుండవచ్చునుగాని సాధారణముగా చలియుండు

కాలము తగ్గిజ్వరముండుకాలము హెచ్చుగనుండును. సాధారణముగా విషజ్వరములందు ఉష్ణదశ 8, 12 గంటలవరకుగాని అంతకంటె హెచ్చుగాగానివ్యాపించును. ఒకానొకప్పుడు చలియే యుండదు. చెమటమాత్రము పట్టును. పిమ్మట రోగికొంచెము సుఖముగా నిద్రపోవును. రెండుమూడుసార్లు జ్వరముపచ్చిన తర్వాత విరామకాలమనగా జ్వరము లేని కాలము తగ్గును. పిమ్మట విరామకాలములో గూడ జ్వరము పూర్తిగా విడువదు. ఒక్కొకప్పుడు మొదటి నుండియు జ్వరము పూర్తిగా విడువక నుండవచ్చును. అశ్రద్ధచేసిన యెడల ఇతర అవయవములలో రోగికి వ్యాధి ప్రారంభించి రోగము బలమగును.

జ్వరముయొక్క వివిధ దశలకును, మలేరియా పురుగుయొక్క వివిధ దశలకును గల సంబంధమును తెలిసికొనిన యెడల చికిత్సచేయునపుడు మిక్కిలి ఉపయోగకరముగ నుండును.

1. రోగియొక్కరక్తమును చలి ప్రారంభింపక పూర్వము కొంచెము సేపటికిముందు సూక్ష్మదర్శనిలో పరీక్షచేసిన యెడల మలేరియా పురుగులన్నియు విభాగము జెందనున్నట్లు తెలియగలదు.

చలి ప్రారంభించునప్పుడు మలేరియా పురుగు పిల్లలు ఉత్పత్తియగుచుండును.

మలేరియా పురుగు పిల్లలయొక్క యుత్పత్తి ఎప్పుడు ప్రారంభించునో అప్పుడు చలియు ప్రారంభమగును.

జ్వరముతీవ్రముగా నున్నప్పుడివి క్రొత్తయెర్ర కణములలో ప్రవేశించును.

2. జ్వరము తీవ్రముగా వచ్చునప్పటికి మలేరియాపురుగు పిల్లలలో ననేకములు తిరిగి క్రొత్తయెర్రకణములలో ప్రవేశించి యుండును. కొన్ని మాత్రము అప్పుడు ప్రవేశించు చుండును.

విరామకాలములలోనివి యెర్రకణములను తినుచుండును.

3. చెమటపోసి జ్వరము తగ్గినప్పుడు జ్వరము పూర్ణముగా విడిచియున్న సమయము నందును, అంతకు పూర్వమే యెర్రకణములలో ప్రవేశించిన మలేరియా పురుగు లాయెర్రకణములను తినుచు పెద్దవగుచుండును.

విషజ్వరములలో కొన్నిదినములవరకు వచ్చిన తరువాత సంయోగసహిత సంతానవృద్ధి విధానముచే మాత్రము పెంపొందునట్టియు, అర్ధచంద్రాకారము గలిగినట్టియు, ఆడుమలేరియా పురుగులు కూడ రక్తమునందు కన్పట్టును. ద్విఖండన విధానముచే వృద్ధిబొందు మలేరియా పురుగులు రక్తములో నున్నప్పుడే జ్వరము పైకివచ్చును. ఇట్టి అర్ధచంద్రాకారముగల మలేరియా పురుగులు మాత్రము రక్తములోనున్న యెడల జ్వరమురాదు.

ఒకానొకప్పుడు ద్విఖండన విధానముచే పెరుగు పురుగులు రక్తములోనున్నను, అవిమిక్కిలి తక్కువగా నున్నయెడల జ్వరము రాకపోవచ్చును. ఇట్లు కొన్నిదినములుగాని, నెలలుగాని, సంవత్సరములుగాని మలేరియా పురుగులు నెత్తురులో కొద్దిగా నున్నను జ్వరమురాక రోగికి వృద్ధత్వముచేతగాని, అధికాయాసముచేతగాని, శరీరదుర్బలత్వము గలిగినప్పుడు తిరిగి మలేరియా జ్వరము రావచ్చును. కొందర ఐరోపియనులకు హిందూ దేశమునుండి వారి స్వదేశమునకు పోయిన తరువాత రెండు మూడు సంవత్సరముల వరకు ఏవిధమైన మలేరియాజ్వరమును లేకపోయినను అకస్మాత్తుగా నట్టివారి కొకప్పుడు చలిజ్వరమువచ్చి వారి నెత్తురులో మలేరియా పురుగులు కన్పట్టుచున్నవి. అట్టి వారినెత్తురులో ఈ రెండు మూడు సంవత్సరముల లోపల మలేరియా పురుగులు ప్రవేశించుటకు అవకాశములేదు. కావున వారి రక్తమునందలి మలేరియాపురుగులుహిందూదేశములో వారునివసించియున్నప్పుడు ప్రవేశించి యుండవలెను. దీనిని బట్టి కొన్ని మలేరియా పురుగులు నెత్తురులో నున్నను జ్వరము రాకపోవచ్చునని రుజువు పడుచున్నది. కొంతమందికి లక్ష యెర్రకణముల కొక్కటికంటె

హెచ్చుగ మలేరియాపురుగు లున్నప్పుడు జ్వరము వచ్చునని కొందరువైద్యులు ఊహించియున్నారు. కాని కొందఱకు వంశపారంపర్యముగా నలవాటు అగుటచేత మలేరియాపురుగులు రక్తములో ప్రవేశించినను వారికి జ్వరమురాదు. ఇందుచేతనే కోయవాండ్రు మొదలగుఅడవిజాతులవారు చలిజ్వరము యొక్క వ్యాపకముగల ప్రదేశములో నున్నను వారల నీజ్వరము సామాన్యముగ బాధింపదు. అదే ప్రదేశమునకు క్రొత్తవార లెవరైన వచ్చినయెడల వారలకు తప్పక ఆజ్వర మంటుకొనును. ఇందుచేతనే చలిజ్వరముయొక్క వ్యాపకముచే ప్రసిద్ధి జెందిన కొన్నిచోట్ల కడుపులలో పెద్దపెద్ద జ్వరపు బిళ్ళలు పెరిగిన వారలున్నను వారిలో కొందరకు జ్వరమురాదు. ఇది అలవాటుచేనని యెరుంగునది.

# ఏడవ ప్రకరణము

## చలిజ్వర నిదానము

చలిజ్వర నిదానమనగా చలిజ్వరమును గుర్తించు విధము.

ఈ దేశములోని కొన్ని వైద్యశాలలలో వైద్యులు దినదినమును వందలకొలది రోగులను చూడవలసివచ్చును. అట్టి సమయములలో త్వరగా పని ముగించుకొనుటయే ముఖ్యమగుటచేత రోగికి సరియైన వైద్యము జరుగుచున్నదో లేదో విచారించుటకు వీలుః లేదు. ఒకవేళ నొకానొక వైద్యుడు శ్రద్ధ చేసి వ్యాధులను గ్రహించిన తరువాతనే వైద్యము చేసెదనని ప్రతిజ్ఞబట్టి పనిచేసినను అట్టివానికి కావలసిన సూక్ష్మదర్శనులు మొదలగు సాధనసామగ్రి యంతయును సామాన్యముగా వైద్యశాలలో నుండదు. అందుచేత తనవద్దకు రోగి వచ్చినతోడనే వైద్యుడు రోగికి అప్పటికప్పుడు ఏదో ఒక మందు ఈయవలసివచ్చును.

కొన్ని వైద్యశాలలలో చేయఁబడు వైద్యము.

జ్వరముతో వైద్యమునకు వచ్చురోగికి వైద్యము చేయుటయందు రెండు పద్ధతులు గలవు. ఒకటి సరియైనపద్ధతి. రెండవదితప్పుపద్ధతి. ఈ దేశమునం దలివైద్యు లనేకులు సాధారణముగానీతప్పుపద్ధతినే అవలంబింతురు. రోగివైద్యమునకురాగానే వైద్యుడు రోగిని "నీకు ఏమి జ్వరము" అని అడుగును. రోగివెంటనే "చలిజ్వరము" అనిచెప్పును. వైద్యుడు తనపని తొందరలో తన అలవాటు ప్రకారము రోగి చెప్పిన రోగ నిదానమును బట్టి చలిజ్వరమునకు క్వాయినా మందనిచెప్పి 3 లేక 6 మోతాదుల మందిచ్చి పంపును. అదృష్టవశమున రోగియొక్క రోగము నిజముగా చలిజ్వరమైన పక్షమున వానికి కుదురును. లేదా రోగి యామందును పుచ్చుకొని కుదురక వైద్యునివిసగించునట్లు బాధించిన తరువాతనో, లేక రోగికి వ్యాధి యధికమై ప్రాణాపాయకరముగ ముదిరినతరువాతనో,వైద్యుడు మేలుకొని రోగిని సరిగా పరీక్షించును. ఒక్కొకవ్యాధి అప్పటికి అసాధ్యస్థితికి వచ్చియుండవచ్చును.

కావున బుద్ధిమంతుడగు వైద్యుడు జ్వరపురోగి వచ్చిన తోడనే యేదోయొక మందిచ్చి వేయక ఆజ్వర మేజాతిలోనిదో సరిగా తెలిసికొని వైద్యము

చేసిన మిక్కిలి మేలగును. ఇది సరియైన వైద్య పద్ధతి. రోగిజ్వరముతో వైద్యమునకురాగానే జ్వరముకలిగించు వ్యాధులనన్నిటిని వైద్యుడు జ్ఞప్తికి తెచ్చుకొనవలెను. అట్టిజ్వరములలో ననేక జాతులు గలవు. కొన్ని జ్వరములు ఊపిరితిత్తులలోని వ్యాధిచేగలిగిన కఫజ్వరములు, కొన్నిజ్వరములు మూత్ర సంబంధమైన అవయవములలో సుఖవ్యాధిచేగాని, మరి యితర వ్యాధులచే గాని పుట్టిన తాపముచే గలుగు జ్వరములు. కొన్ని జీర్ణకోశములలోని మాంద్యము చేతగాని, ఏలుగుపాము, నులిపురుగు మొదలగు జంతువుల మూలమునగాని మలబద్ధకము వలన గాని గలుగు జ్వరములు; కొన్ని జలుబుచేతగాని, యెండ ఉడుకుచేతగాని గలుగు జ్వరములు; కొన్ని మశూచికము, ఆటలమ్మ పొంగు మొదలగు వానిచే గలుగు జ్వరములు; కొన్ని సన్నిపాత జ్వరములు; మరికొన్ని సూతికా జ్వరములు. లేక గాయములు మొదలగు వానియందలి చీమువలన పుట్టిన వ్రణజ్వరములు. ఇట్లు లెక్కకు రాని అనేక జ్వరములు గలవు. ఇంకను మనకు కారణము సరిగా తెలియని కాల జ్వరము మొదలగు జ్వరము లెన్నియో గలవు. ఈ జ్వరములనన్నిటిని మనస్సునం దుంచుకొనక రోగి "చలిజ్వరము" అనిచెప్పినతోడనే క్వయినా పంచిపెట్టుట తగదు. రోగి తనవద్దకు వచ్చినతోడనే

అనేకవిధములగు జ్వరములు.

ఒక్కొక్క అవయవమును వరుసగ పరీక్ష చేసిన యెడల పైని చెప్పబడిన వ్యాధులలో నెద్దియైనను ఉన్నదో లేదో సాధారణముగా తెలియవచ్చును.

జ్వరపుగడ్డ పెరిగిఉన్నదా? లేదా?

రోగికి ఇతరవ్యాధులు ఏమియును లేక ఒక్క జ్వరమే యున్నయెడల వానికడుపులో జ్వరపుగడ్డ పెరిగియున్నదో లేదో చూడవలెను. జ్వరపుగడ్డ స్పష్టముగా తెలియుచున్న యెడల సామాన్యముగా రోగియొక్క జ్వరము చలిజ్వరమే అయియుండును. చెన్నపట్టణములో ప్రస్తుతము వ్యాపించియున్న కాలజ్వరమను వ్యాధియందును ఇంక మరికొన్ని వ్యాధుల యందును కూడ జ్వరపుగడ్డ పెరుగును. అయిన ఆవ్యాధులు సామాన్యముగా నన్నిచోట్ల నుండవు.

లేనియెడలచలిజ్వరము గుర్తించు టెట్లు.

ఒకవేళ రోగి చలిజ్వరము వచ్చిన మొదటి వారములోనే వైద్యమునకు వచ్చినయెడల వానికి సామాన్యముగా జ్వరపుగడ్డ పెరిగియుండదు. అట్టిచో జ్వరపుగడ్డ పెరిగియుండని వ్యాధులలో నీచలిజ్వరమును గుర్తింప వలెను. రోగి తన జ్వరము తప్పక చలితోకూడి వచ్చుననియు రెండుదినముల కొకసారిగాని మూడుదినముల కొకసారిగాని నియమిత కాలమునకువచ్చి కొంతకాలముండి చలిజ్వర లక్షణముల నన్నిటిని చూపిన దనియు చెప్పినప్పుడును, రోగి ఆలక్షణములను తెలివిగ గ్రహించి

చెప్పగలవాడని వైద్యునకు తోచినప్పుడును రోగి యొక్క వ్యాధి చలిజ్వరమని నిశ్చయముచేసి మందును ఈయవచ్చును.

నెత్తురునుపరీక్షింపవలెను.

దినదినము జ్వరమువచ్చు రోగులవిషయములో జ్వరపుగడ్డ పెరిగియుండని యెడల రోగనిదానము కష్టము. ఏఅవయవము నందును జ్వరమునకు కారణము కానరాని యెడల, మశూచికము ఆటలమ్మ మొదలగు వ్యాధులలో నేదైనను సోకి యుండునని అనుమానముగా నున్నయెడల, రెండుదినములు నిదానించి చూచిన నవి బయలుపడగలవు. ప్రారంభస్థితిలోని క్షయజాతి జ్వరముగాని, జలుబు లేక, ఉడుకు వీనివలన, పుట్టిన జ్వరముగాని, సన్నిపాత జ్వరముగాని, ప్రస్తుతము మనకు కారణము తెలియని ఇతర జ్వరములలో నేదైన గాని, రోగిని బాధించు చున్నప్పుడు వానినుండి చలిజ్వరమును గుర్తించుట కష్టము. అట్టి యెడల రోగియొక్క నెత్తురుచుక్క నొకదానిని తీసి వైద్యుడు తాను పరీక్షింపగలిగినయెడల సూక్ష్మదర్శినితో పరీక్షింపవలెను. లేదా చెన్నపట్టణమువద్ద అందుకొరకు ప్రత్యేకముగా సర్కారువారిచే నేర్పరుపబడియున్న కింగుఇన్స్టిట్యూటు (King Institute) అనుఆఫీసునకు ఒకచుక్క నెత్తురును అందు కొరకై యేర్పడియున్న గాజు పలకపై పరచి పంపవలెను. అక్కడ రు. 5-0-0 లు ఫీజుతీసికొని వారా నెత్తురును పరీ

క్షించి మలేరియా పురుగులు నెత్తురులో నున్న యెడల చెప్పుదురు. లేదా యితరవ్యాధి ఏదియైన నున్నట్లు తమకుతోచినయెడల తమసలహానుపంపు దురు. కాని, చలిజ్వరమైన దానికిని, కాని దానికిని క్వయినానుఇచ్చి కుదురలేదని తొందర పడుట ఎంత మాత్రమును సరికాదు. వ్యాధిని నిశ్చ యముగ తెలిసికొనకముందే క్వయినాను పుచ్చు కొనిన రోగియొక్క నెత్తురును పరీక్షించి నప్పుడు ఆనెత్తురు వలన నిజమైన వ్యాధి తెలియదు. జ్వర తీవ్రమునుబట్టి నిదానమును తెలిసికొనవలసి వచ్చి నప్పుడు క్వయినాను మధ్యమధ్య ఇచ్చుచుండిన యెడల జ్వరనిదానము సరిగా తెలియదు. చలి జ్వరమునకే క్వయినా ఉపయోగ కరమైనది కాని యితర జ్వరములలో దానిప్రయోజనమంతగాలేదు. కావున చలిజ్వరము అవునా కాదా యని సందే హముగా నున్నప్పుడు మనము ముఖ్యముగా గమ నింపవలసిన అంశము లేవియన:—

సందేహము గా నున్నప్పు డు చేయవల సిన చికిత్స.

1. రోగికి అన్నముపెట్టుటమాని పాలుగాని,గోధు మజావగాని, పాలవలె పలుచగ నుండునటుల నూకజావగాని కాచి ఇయ్యవలెను.

2. నాలుగుగంటల కొకసారి శరీరపువేడిమిని జ్వరపు పుల్లతో కొలవ వలెను.

3. ఒక్కొక్క నెత్తురును తగిన గాజుపలకపై రాచి పరీక్షకు పంపవలెను.

4. జ్వరము అధికముగా నున్నయెడల క్వయినా ఇయ్యక జ్వరము తగ్గించు ఇతరమందును దేని నైనను ఇయ్యవచ్చును.

5. సాఫీగావిరేచనమును చేయుమందును, చెమట పుట్టించుమందును, దేనినైననుఇచ్చుటమంచిది.

6. చలిజ్వరము అవునో కాదో నిశ్చయించు కొనక పూర్వము క్వయినా మాత్రము ఇయ్య కూడదు.

ఇట్లు చికిత్సచేయుచు రోగిని కనిపట్టి చూచు చుండునెడల బహుశః ఒకటిరెండు దినములలో చలిజ్వర సంబంధమైన లక్షణము లన్నియు వైద్యు డు కనిపట్టవచ్చును. లేదా నెత్తురులో చలిజ్వరపు పురుగులు కనబడవచ్చును. చలితోప్రారంభించుట, విడిచివిడిచి జ్వరమువచ్చుట, కొంత నియమితకాల మున కొకసారి జ్వరమువచ్చుట, జ్వరపుగడ్డ పెరు గుట, మొదలగు చలిజ్వర చిహ్నములుగాని, రక్త ములో చలిజ్వరపుపురుగులుగాని యితరమైన నిద ర్శనములుగాని, కనబడనియెడల నావ్యాధి చలి జ్వరము కాదని యూహించి యితర జ్వరములకు వైద్యము చేయుచు రోగిని క్రమమైన శోధనలో

నుంచవలెను. నెత్తురును కఫమును అప్పటప్పట, సూక్ష్మదర్శినిలో పరీక్షించుచుండవలెను.

సన్నిపాత జ్వరముక్షయ జ్వరము మొదలగునవి.

జ్వరము దినదినమునకు హెచ్చుచు 6-వ పటములో చూపబడినట్లు ఒక క్షణమైనను విడువక రెండువారములవరకు నున్న యెడల నది బహుశః సన్నిపాత జ్వరము. ఇదిరక్తమును పరీక్షించుటచే తెలియగలదు. లేదా క్షయ జ్వరమో, రణజ్వరమో, కాలజ్వరమో (Kala Azar) మరియెద్దియో వైద్యుడు బుద్ధికుశలతచే కనుగొనవలెను.

# ఎనిమిదవ ప్రకరణము

## చికిత్స

జ్వరముతో కూడిన ఏ వ్యాధికైనను చక్కగ వైద్యము చేయవలెననిన యెడల ఆ జ్వరమునకు కారణ మెద్దియో నిశ్చయముగ తెలిసికొనుట మిక్కిలి ఆవశ్యకము. ఒక రోగియొక్క వ్యాధి చలి జ్వరమని నిశ్చయముగా తెలియక పూర్వము ఏమి వైద్యము చేయవలెనో 85-వ పుటలో చెప్పి యున్నాము. "చలిజ్వరపురోగి" అని నిశ్చయముగా తెలిసిన తోడనే వానికిక్రింది ప్రకారము వైద్యము చేయవలెను.

మొదట విరేచనములకు మందుఇయ్యవలెను.

వైద్యము ప్రారంభించిన దినమున సామాన్యముగా నాలుగైదు విరేచనము లగునట్లు మందు ఇయ్యవలెను. పైత్యతిత్తిని శుభ్రపరచు నిమిత్తము రసభస్మము (Colomel) గాని రసముకలిసిన ఇతర మందు దేనినైనను గాని ఒకటి రెండు మాత్రల నిచ్చిన మేలగును. ఇందువలన జీర్ణకోశములుశుభ్రమైనతరువాత ఇయ్యబోవుమందులన్నియు చక్కగ జీర్ణమై రక్తములోనికి జేరును.

చలి జ్వరములకు క్వయినా సిద్ధౌషధము.

పిమ్మట ద్రావకముగనో లేక మాత్రలుగనో క్వయినాను ఇచ్చుటయే చలిజ్వరమునకు సిద్ధౌషధము. కానదీనినుపయోగించుటలో నెంతమెలకువగానుండిన అంతత్వరలో జ్వరము కుదుర్చవచ్చును.

క్వయినాను ఎప్పుడు ఎట్లు ఇయ్యావలెను.

సాధ్యమైనప్పుడెల్లను ఏవేళయందు జ్వరము ప్రారంభించునో తెలిసికొని జ్వరమువచ్చు సమయమునకుపూర్వము 4 గంటలకుముందుగా10*గ్రెయినులు క్వయినాను ఇయ్యావలెను. పిమ్మట ఒక్కొక మోతాదుకు 5 గ్రెయినులు చొప్పున దినముకు నాలుగు మోతాదుల క్వయినాను 5 దినముల వరకుఇయ్యావలెను. ఈఅయిదుదినములలోగా జ్వరమునిలువనియెడల అది చలిజ్వరముకాదని సాధారణముగ చెప్పవచ్చును. మొదట జీర్ణకోశములను శుభ్రిపరచి పిమ్మట పైనచెప్పినప్రకారముక్వయినా ఇచ్చుట వలన ప్రతి చలిజ్వరపు రోగికిని తప్పక జ్వరము విడుచునని చెప్పవచ్చును. ఒకవేళ ఎవరికైనను కుదురనియెడల నారోగికి తగినన్ని మోతాదులను తగిన సమయములలో నియ్యలేదనిగాని, ఆ రోగియొక్క జ్వరము చలిజ్వరము కాదనిగాని ఊహింప వచ్చును.

సరిగా క్వయినాను ఇచ్చిన తరువాత అనేక రోగులకు 24 గంటలు మొదలు 72 గంటలులోగానే

---

* గ్రెయిను అనగా గురిగింజ యెత్తు.

జ్వరము నిలిచిపోవచ్చును. వారిరక్తములోని చలి జ్వరపు పురుగులు చాలభాగము అప్పటికి చచ్చి పోవును. అట్టివారిని వెంటనే తమపనిలోనికి పోనిచ్చినను, మందు మాత్రము 5 దినములవరకు, దినమునకు 20 గ్రెయినులు చొప్పునను, అటుపిమ్మట ఈక్రింద వివరించిన ప్రకారమును మిక్కిలి శ్రద్ధగ నిచ్చుచుండవలెను.

అయిదవ దినము మొదలు పూటకు 5 గ్రెయినులచొప్పున 3 పూటలను మూడు మోతాదులు ఇయ్యవలెను. ఇట్లు 5 దినములవరకు తీసికొనగా తిరిగి జ్వరము రానియెడల ఆదినము మొదలు ఒకనెలవరకు దినమునకు 5 గ్రెయినులు చొప్పున ప్రతిదినమును ఒకమోతాదు ఈయవలెను. ఈమధ్యలో ఏదినమున జ్వరము వచ్చినను ఆదినముననే జ్వరము ప్రారంభించినట్లు ఎంచి తిరిగి మొదట ఇచ్చినట్లే దినమునకు 20 గ్రెయినుల చొప్పున ఇచ్చుచు చికిత్సనంతను తిరిగి చేయవలెను.

తిరిగి తిరిగి వచ్చు చలిజ్వరములకు రెండు మూడు సంవత్సరముల వరకు ఒకొక్కప్పుడు క్వయినాను ఇయ్యవలసివచ్చును. జ్వరపుగడ్డ పెరిగి యున్నదను సందేహము తీరువరకును రోగి క్వయినాను పుచ్చుకొనుచుండ వలసినదే. ఇట్టి రోగులకు క్వయినాతో పాటుకొంచెము ఉల్లిపాషాణమును,

ఒకప్పుడు రెండుమూడు సంవత్సరముల వరకు క్వయినా ఇయ్యవలెను.

(Arsenic) లోహమును (Iron) వైద్యులు తగిన మోతాదులను తెలిసికొని ఉపయోగింపవచ్చును.

దినమునకు 20 గ్రెయినులు చొప్పున మొదటి నుండియు తీసికొనినరోగికి సామాన్యమునగా తిరిగి జ్వరమురాదు. ఒక్కొక మోతాదుకు 10 గ్రెయినులు చొప్పున రెండు మోతాదులలో గాని, 5 గ్రెయినుల చొప్పున నాలుగు మోతాదులలో గాని ఈఇరువది గ్రెయినులను తీసికొనవచ్చును.

పదిసంవత్సరముల పిల్లలకు మోతాదు.

10 లేక 12 సంవత్సరముల బిడ్డలకు దినమునకు 15 గ్రెయినులతో ప్రారంభించి 5 దినములయినతరువాత దినమునకు 10 గ్రెయినులు చొప్పున ఇచ్చి, 10 దినములైన తరువాత ఒకమాసము వరకు దినమునకు 5 గ్రెయినుల చొప్పున నీయవచ్చును.

5 మొదలు 10 సం॥ రముల పిల్లలకు మోతాదు.

5 సంవత్సరములు మొదలు 10 సంవత్సరముల వరకు వయస్సుగలబిడ్డలకు మోతాదుకు 5 గ్రెయినులు చొప్పున దినమునకు రెండు మోతాదులు ఈయవలెను.

5 సం॥ రముల లోపలి పిల్లలకు మోతాదు.

5 సంవత్సరముల లోపలి వయస్సుగల బిడ్డలకు వయస్సును బట్టి ఒక్కొక సంవత్సరము వయస్సునకు ఒక్కొక గ్రెయిను మోతాదు చొప్పున దినమునకు రెండు మోతాదులు ఇచ్చుటయుక్తము. సామాన్యముగా జ్వరము హెచ్చుగ నున్నప్పుడు,

రెండుగ్రెయినులకంటె తక్కువమోతాదులనిచ్చుట వలన పిన్నలకుకూడ అంతగా నుపయోగకరముగా నుండదని నాఅభిప్రాయము. పిన్నల విషయములో క్వయినా చేదుగనుండుట యొకగొప్ప అభ్యంతర ముగానున్నప్పుడు "యూక్వినీను" అను చేదులేని మరియొక తరహా క్వయినాను చక్కెరతో కలిపి పొడిగా నీయవచ్చును. నీళ్ళలో కలిపిన యెడల అదికూడ చేదగును. అయినను ఇదిచేదుగల క్వయి నాయంత గుణమునీయదు.

జ్వరముతగ్గిన తరువాత చేయవలసిన చికిత్స.

జ్వరము తగ్గినతరువాత చేయవలసిన వైద్యము లోనే సామాన్యముగా మనదేశములో మిక్కిలి అశ్రద్ధ చేయుచున్నారు. జ్వరము నాలుగుదినములు రాకపోయిన తోడనే ఆజ్వరము పోయిన దనుకొని ఔషధము తీసికొనుట మానుచున్నారు. ఇదిగాక క్వయినా అనిన మనదేశముప్రజలలో ననేకులకొక విధమైన ద్వేషముగలదు. దానియందు అనేకదుర్గుణములుగలవని చెడువాడుకలుగలవు. అవియన్నియు నంతగా నిజమైనవికావు. క్వయినా తీసికొనినతరు వాత కొందరికి తాత్కాలికముగా చెవుడు పట్టుటయు, ఒకానొకప్పుడు పసరుపెరిగి వాంతులు గలుగుటయు, గలదు. కాని వీనిరెంటిని అంతగారోగి గమనింపవలసిన పనిలేదు. మందుయొక్క మోతాదును తగ్గించిన వెంటనే చెవుడు పోవును. విరే

చనము సాఫీగా అగునట్లు మందు ముందుగా తీసి కొని, అనుపానములను కొంచెముమార్చి ఇచ్చిన యెడల క్వయినాయందలి వాంతిగలిగించు గుణము నిలిచిపోవును.

క్వయినా యందు మన ప్రజలకు గల ద్వేషమునకు కారణములు.

క్వయినాయందుమనప్రజలకుండు ద్వేషమునకు మరి రెండుకారణములు గలవు. అందుముఖ్యమైన దేమనగా మన దేశమందలి శాస్త్రజ్ఞానములేని వైద్యులనేకులు, చలిజ్వరమునకు తాముకూడ క్వయినా ఇచ్చి కుదుర్చునెడల తమ కభిమానమని యెంచి తాము క్వయినాను ఉపయోగించుటలేదని డంబములు కొట్టుచు క్వయినాయొక్క చెడుగుణములు గోరంతలు కొండంతలుగా వర్ణించుచుందురు.

కొందరు స్వదేశవైద్యులు చేయుపద్ధతి.

'నేనుకూడ క్వయినాయిచ్చి ఒక దినములో జ్వరములను నిలుపగలను. కానిదానిదుర్గుణములకు జడిసి నేను ఎన్నడును దానిని ఉపయోగించను' అని కొందరు, 'క్వయినా ఇచ్చినయెడల జ్వరము లోపలనే అణగిపోయి శరీరమునకు కీడుకలుగజేయు నని మరికొందరును, ఈవైద్యులు చెప్పుచుందురు. మలేరియాపురుగులను క్వయినాఎంతశీఘ్రముగనాశనముచేయునో తెలిసికొనినవార లెన్నడును అట్లు చెప్పరు. వీరిలో ననేకులు దానివాసన మారునట్లు కొంచెముకస్తూరినో,పిప్పరమెంటునో,హారతికర్పూ

ఏమందు త్వ రలో వ్యాధి నికుదుర్చునో అదియే మంచిమందు.

ముచేత మనదేశమునందు పుట్టినదే మంచిమందనిగాని, మన పూర్వశాస్త్రములయందెన్నడో చెప్పబడియుండునదే మంచిదనిగాని గర్వపడువారు బుద్ధికుశలులు గారని చెప్పవచ్చును. ఏదేశమునుండి వచ్చినను ఏవైద్యునిచే కనిపట్టబడినను ప్రపంచమునందలి ప్రజలందరును తగినమందును గౌరవింపవలసినదే.

ప్రజలుక్వయినా యందలి ద్వేషమును విడువవలెను.

కాబట్టి మనదేశీయ వైద్యులు, ప్రజలును, క్వయినాయందు తమకు గల ద్వేషమును విడిచి విరివిగ దానిని చలిజ్వరములలో నుపయోగించి దేశముయొక్క ఆరోగ్యస్థితిని బాగుపరుచుదురు గాక యని కోరుచున్నాను.

మాత్రలు ద్రావకము, పొడుము; వీనిలో నేదిమంచిది?

క్వయినాను మాత్రలుగా నిచ్చుట మంచిదా? పొడుముగా గాని ద్రావకముగా గాని ఇచ్చుట మంచిదా? అని సందేహము తోచవచ్చును. చౌకగ వైద్యము చేయుటయే ముఖ్యముగనుండు ధర్మ వైద్యశాలలలో క్వయినాకు నిమ్మకాయ రసము లేక డైల్యూటు సల్ఫ్యూరికాసిడ్డు మొదలగు పుల్లని ద్రావకములను కొంచెముచేర్చి ఒక్కొక మోతాదును ఒక్కొక అవున్సు నీటితో కలిపి ఇచ్చుట అనుకూలము.

కొందరు సుకుమారులు చేదు ద్రావకమును త్రాగుటకు ఇష్టపడక పోవచ్చును. అట్టివారికి

చక్కెరపాకములో పొదిపిన మాత్రలను ఇచ్చుట యుక్తము. ఈమాత్రలను ఎప్పటికప్పుడు క్రొత్తగా తయారుచేసికొనుచుండవలెను. ఏలయన మాత్రలు ఆరిపోయి మిక్కిలి గట్టిపడినయెడల నవి జీర్ణకోశములో జీర్ణముగాక మలమునందుపోయి మందంతయు వృధా యగును. అందుచేతనే ఒక్కొకప్పుడొక్కొక్క రోగికి ఎన్నిదినములు ఎన్నిమాత్రలు ఇచ్చినను జ్వరము కుదురక యొకనాడు విరేచనములకు మందిచ్చిన ఆ మాత్రలన్నియు మలములో నొక్కపెట్టున ఉండలుఉండలుగా వెలువడును.

చక్కెరలో పొదిపినమాత్రల ఉపయోగము.

అయినను చక్కెర పైకప్పుగలమాత్రలు త్వరగా జీర్ణమగును. వానిని సామాన్యముగా నుపయోగింపవచ్చును. సర్కారువారు చలిజ్వరము గల ప్రదేశములలో క్వయినా పొట్లములను ఉచితముగ పంచిపెట్టుచున్నారు. కొద్ది వెలలకు తపాలాఫీసులో అమ్ముచున్నారు. ఈమందు చేదుగ నుండుటచేత ప్రజలలో నంతగా హితవుగా వ్యాపకమగుట లేదు. ఇదిగాక ఇట్టిపద్ధతి ప్రజలకు క్వయినాయందు గల అనిష్టమును హెచ్చించుచున్నది. ఊరక వచ్చుచున్నందువలన, వారికి దానివిలువ తెలియక పోవుటచేతనే సామాన్యప్రజలు అట్టి పద్ధతివలన లాభములను పొందనేరరు. దీనికి తోడు నేను ఇదివరలో చెప్పియున్నట్లు అజ్ఞానులగు వైద్యులు

దీనిని చేయు దూషణము, చేదువలన ప్రజలకు గలిగిన సహజద్వేషమును హెచ్చించును. సర్కారు వారును, డిస్ట్రిక్టుబోర్డులును, మ్యునిసిపాలిటీలవారును, ప్రజల యుపకారమునకై క్వయినాను పంచిపెట్టినప్పుడు, ఆ పంచిపెట్టునది తియ్యనిమాత్రలుగా పంచిపెట్టినయెడల దీనివ్యాపకము ఇప్పటికంటె చాలరెట్లు అధికము కాగలదని నా నమ్మకము.

జ్వరముచేత బాధపడునప్పుడు కొన్నిపొట్లముల నొకరోగి కొనినను, జ్వరము కొంచెము నెమ్మది యయినతోడనే ఈ పొట్లములలోని మందు చేదగుటచే వానిని పారవేయుచున్నాడు. ఈమందే తియ్యగనున్న యెడల దానిని సామాన్యముగా నారోగి వృథాచేయడు. తనకు గుణము తప్పక కనబడుచుండుటచే ఎంతవరకగత్యమో అంతమందును కొని యుపయోగించుకొనును.

క్వయినాలలో నేదిమంచిది.

వైద్యశాలలో సామాన్యముగ క్వయినా సల్ఫేటు అను దానిని ఉపయోగించెదరు. దీనినే మనవారు సాధారణముగా క్వయినా అని వాడుదురు. ఇది క్వయినా చేరిన మందులన్నిటిలో చౌక అయినది. దీనిని సామాన్యముగా నందరును వాడవచ్చును. ఒకానొకచోట క్వయినా హైడ్రోక్లోరైడుఅనుమందుసల్ఫేటుకంటె వేగముగను, నిశ్చ

యముగను పని చేయును. దీని వెల కొంచె మధి కముగ నుండుటచేత క్వయినా సల్ఫేటును సామాన్యముగా నుపయోగింపవచ్చును. ఈ సల్ఫేటు నీళ్లలో సరిగా కలియదు. నీళ్లవంటి చింతపండు రసము (చారు), నిమ్మకాయ రసము, మొదలు గాగల పుల్లని ద్రావకములలో నిది మిక్కిలి శీఘ్రముగ లీనమగును (కలిసి పోవును). కావున క్వయినాను పొడుముగాతీసికొను వారలందరును ఈరీతిని పుల్లని ద్రావకములలోకలిపి తీసికొనుటయుక్తము.

విషజాతుల చలిజ్వరములలో క్వయినాను నెత్తురులోనికి పిచికారిచేయుట యుక్తము.

కొన్ని విషజాతుల చలిజ్వరములలోను, ఒక సారికుదిరి తిరిగి వచ్చి బాధించు చలిజ్వరముల లోను, క్వయినాను నోటిమార్గమున ఇచ్చుటకంటె దానిని నేర్చిన వైద్యుడు తగిన గాజు పిచికారితో మోతాదుకు పది గ్రెయినులు చొప్పున "క్వయినా హైడ్రోక్లోరైడు" అను మందును 20 చుక్కలు కాచిన నీళ్ళలోకలిపి నెత్తురులోనికి పోవునట్లు, పిఱ్ఱ మీదగాని భుజముమీదగాని యుండు కండలోనికి పిచికారిచేసిన యుక్తము. దీనివలన శరీరమున కేవిధమయిన బాధగాని అపాయముగాని లేదు. ఇందువలన చిరకాలము నుండి శల్యగతమై జీర్ణించిన జ్వరములుకూడ అతి శీఘ్రముగ కుదురును.

కొన్ని విషజాతుల చలిజ్వరములలోను, చలిజ్వరపు పురుగుచేకలిగిన జిగట విరేచనములలోను, ఒక మోతాదునకు 60 గ్రెయినులు క్వయినా కలిసిన నీళ్లను ఆసనము ద్వారా పిచ్చికారీ చేసినయెడల నామందుపేగులోనుండి రక్తములోనికిపోయి రోగికి స్వాస్థ్యముకలుగజేయును.

చలిజ్వరముతోకూడ ఇతర వ్యాధులున్నయెడలవానికి ప్రత్యేకముగ చికిత్స చేయవలెను.

పైనిచెప్పిన చికిత్సయంతయు రోగికి చలిజ్వరముతో పాటు ఇతర రోగములేవియు లేక యున్నప్పుడు మిక్కిలి యనుకూలముగ నడచును. కాని గుండెలయందు గాని, ఊపిరి తిత్తుల యందుగాని, జీర్ణకోశములందు గాని, మెదడునందుగాని, ఇతర అవయవములందుగాని, మరియొక వ్యాధి ఏదైనను చలిజ్వరములో మిశ్రమమై యున్నయెడల పైనుదాహరించిన చికిత్సకు తోడుగా నా యా వ్యాధులకు తగిన చికిత్సలను కూడ చేయుచుండవలెను. ఆ వ్యాధులను, వాని చికిత్సలను గూర్చి ఇక్కడ వ్రాయుట కెడములేదు. వ్యాధి నిదానము విషయములో ఎంత మాత్రము సందేహముగా నున్నను, రోగి తగిన వైద్యుని సలహాను పుచ్చుకొనవలెను. ఏవైద్యుని కయినను రోగముయొక్క నిదానమును గూర్చి సందేహ మున్నయెడల ఇతర వైద్యులతో సంప్రతింపవలెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

### చలిజ్వరమును నివారించు పద్ధతులు

చలిజ్వరమును నివారించుటకు రెండు పద్ధతులు గలవు.

I. క్వయినాయొక్క సాయముతో నివారించు పద్ధతులు.

II. క్వయినాయొక్క సాయమును కోరకయే నివారించు పద్ధతులు.

క్వయినాయొక్క సాయముతో చలి జ్వరమును నివారించు పద్ధలుతు.

I. క్వయినాయొక్క సాయముతో నివారించు పద్ధతులు. ఇందు రెండు విధములు కలవు.

౧. గ్రామములోని ప్రజల నందరను కాపాడుట కొరకేర్పడినవి.

౨. ప్రతిమానవుడును తన్నుతాను కాపాడుకొనుట కేర్పడినవి.

౧. ఒక గ్రామములో ఎక్కడను చలిజ్వర మిక ముందు వ్యాపింపకుండ చేయవలె ననిన అంతకు పూర్వ మాగ్రామములో నున్న చలిజ్వరమును నిర్మూలము చేయవలెను. పిమ్మట క్రొత్తగ నీ జ్వరములు రాకుండ చేయవలెను.

చలిజ్వరపు రోగుల సందరను లెక్కించి వారలకందరకు క్వాయినా యియ్యవలెను.

ఇందులకు ఆ గ్రామమునందు చలిజ్వరముగల రోగుల నందరిని లెక్కించి జాబితాలు తయారు చేయవలెను. ఆ గ్రామమునందు జ్వరపుగడ్డగల వారి జనాభా లెక్కలు వ్రాయవలెను. సందేహముగనున్న ప్రజలయొక్క, అందు ముఖ్యముగ బిడ్డలయొక్క, నెత్తురుబొట్టు నొకదానిని తీసికొని సూక్ష్మదర్శనితో పరీక్షింపవలెను. ఈ ప్రకారము చలిజ్వరసంబంధమైన అనుమానముగల మనుష్యుల జాబితాలు తయారుచేసి వారి కందరకు క్వాయినా మాత్రల నియ్యవలెను. చేదుమందు ఇచ్చిన యెడల వారు చాటునకు పోయి దానిని పారవేయుదురు. కావున చక్కెర పైకప్పుగల తియ్యని మాత్రల నిచ్చుట మిక్కిలి ఉపయోగకరము.

ఇట్లీమందునిచ్చి ఆరు మాసముల వరకు గ్రామములో చలిజ్వరపు రోగి యొక్కడుకూడ లేకుండ గాలించి చేయవలెను. గ్రామములోనికి క్రొత్తగా వచ్చు ప్రతివానిని పరీక్షించి వాని పేరు జాబితాలో చేర్చి వానికి చలిజ్వర మున్నయెడల చికిత్స చేయవలెను. ఇట్లు చేయుటవలన ఆ గ్రామములో దోమలున్నను ఆదోమలకు చలిజ్వరపు పురుగులు దొరకనందున చలిజ్వరము వ్యాపింపక కాలక్రమమున నశించి పోవును.

ఒక గ్రామములోని జనుల కందరకును ఈ ప్రకారము వైద్యము చేయుట సాధారణముగా సాధ్య

ముకాదు. ఏలయన ప్రజలందరును అభిమానించు కొని ఒక కట్టుగా పనిచేసినగాని ఈపద్ధతివలన చలి జ్వరము నశింపుగాదు. ఒక్కరోగి గ్రామములో మిగిలియున్నను, దోమలు వానినుండి చలిజ్వరపు పురుగులను సంపాదించి వానిని పెంచి, యనేక వేలుగాచేసి, యనేకులకు పంచిపెట్టును. కావున ఐకమత్యముగాని, తగినంతకట్టు బాట్లుగాని లేని స్థలములలో ఈ పద్ధతివలన ప్రయోజన మంతగా నుండదు. అయినను జలుళ్లలోను, పటాలముల లోను, ఈ పద్ధతి మిక్కిలి చక్కగ పనిచేయును. గ్రామములలో కూడ సాధ్యమైనంత వరకు అవలం బింపవచ్చును. ఎంత తక్కువమంది చలిజ్వరపు రోగులు గ్రామములో నున్నారో దోమలకు అంత తక్కువగా జ్వరపు విత్తనములు దొరకును గదా! దోమలకు చలిజ్వరపు పురుగులు చాలినన్ని దొర కనియెడల వ్యాధి కొంతవఱకైనను తగ్గియుండును.

౨. గ్రామమంతయు గాపాడుటకు సాధ్యము కానప్పుడు తమ్ము మాత్రము చలిజ్వరమునుండి తప్పించుకొన దలచినవారు ప్రతివారును చలిజ్వర ముగల ప్రదేశములలో తాము నివసించు నన్నిదిన ములును వారమున కొకసారి పదిలేక పదునేను

తాముమాత్రమువారమున కొకసారి క్వయినా పుచ్చుకొనవలెను.

